శ్రీరస్తు

# వాల్మీకి

## ఉపోద్ఘాతము

తొలుత దుర్వృత్తులుగా నుండి యావల సువృత్తులై యుత్తమత్వ మధిగమించినవారి జీవితములు మన నాటకవాఙ్మయమున ప్రాగ్యములుగా నున్నవి. ఇట్టి చరిత్రములు పురాణములలో నెడనెడం గానవచ్చుం గాని యవి కథాపురుషుల చిత్తవృత్తిపరిపాకంపుం గ్రమంబు దెలుపునవి గాక, యే తీర్థమునం గ్రుంకుటచేతనో యే క్షేత్రమును మెట్టుటచేతనో యే దైవమును స్మరించుటచేతనో తటాలున వారికిం బాటిల్లిన యగ్గలంపు మహిమ నుగ్గడించు కల్పనలుగా నున్నవి. ఆ కథలకుం దీర్థాదిప్రభావాభివర్ణనమునందు దృష్టియే కాని, మనుష్యప్రభావవైచిత్ర్యమునందుం దాత్పర్యము లేదు. కావున నట్టి కథలు ప్రాకృతుల నాయాయి కర్మలకుం బ్రేరించునవి యై యా కతన నుపకారకములే యైనను, అవి వ్యక్తుల నడవడికలోని మార్పులకు కారణములు బాహ్యమునం గాక యంతరమున నన్వేషించు ప్రబుద్ధమతులకు పసం గొలుపంజాలవు. ఇది పురాణగాథల విషయము. ఇంక నాటకములలో నిట్టి పరిపాటిం జూపంబడుట లేకపోయిన దనంగా, మన యాలంకారికులు మన కేర్పఱిచిన దురుల్లంఘ్యవిధివిధానములవలననే. ఎట్లన — ఈ విధుల చొప్పున నాయకుండు పుట్టిన కులము మహోన్నతముగా నుండవలయును (ఇదియే కులీనత). అతని రూపము కన్నుల మిఱుమిట్లు గొలుపుచుండవలయును (ఇదియే యౌజ్జ్వల్యము). అతని చిత్తము ధర్మైకాయత్తముగా నుండవలయును (ఇదియే ధార్మికత్వము). అతని విశ్రాణనము కల్పతరుకామధేనుపరభావిగా నుండవలయును (ఇదియే యౌదా

ర్యము). ఆతని వెలుఁగు ప్రోల వేవెలుంగు దివ్వటీవలెఁ బరఁగి వెన్నె కావలయును (ఇదే తేజస్విత). ఆతని తెలివితేటలకును శుక్రగురుపాటవమునకును సాటి యుండరాదు (ఇవే పాండిత్యవైదగ్ధ్యగుణములు). నయముల అతఁడు లోకోత్తరగుణోత్తరుఁడుగా నుండవలయును. కాని వెళ్లి, “ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః” అన్నట్లాతనియందుఁ గొన్ని కొఱంతలు కానవచ్చినా, కవియగువాఁడా వానిం దన యిచ్చకొలంది తొలఁచి మలఁచి యా నిష్కళంకమూర్తిగ, గాను నే మన ప్రోల నిలుపవలయును. ఇది మన నాటకసంప్రదాయము. ఇఁక యిట్టిచోట మన ప్రాచేతసునివంటి పాత్రమునకు ఎట్టి ప్రవేశము కలుగును? ఇతఁడు జన్మముచేతఁ బాఱుఁడయ్యును, కర్మముచేఁ గ్రూరుఁడు. ఆటవికుల కెల్ల దొర యయ్యును, వృత్తిచేత దొంగ. ఆ జన్మసిద్ధమైన బ్రహ్మవర్చసము కలవాఁ డయ్యును, శబరతరుణీసంగమమున నష్టప్రభావుఁడు. ఇట్టివాఁడు నాటకమునకు నాయకుఁ డగుట తగునా? తగఁడు. ఈ ప్రకార మాలంకారికశాపోపహతులై సెల్పుల్వమున కొఱసి యడఁగియుండి యిపుడిపుడు పురాణసాహిత్యమున ప్రాక్షురసుల విముక్తశాపులై తలయెత్తుచున్న పురుషవిశేషులు క్వాచిత్కముగాఁ గానవచ్చుచున్నారు. అట్టివారిం గూర్చి రచితము లైన దృశ్యకావ్యములలో శ్రీమునుత గోపాలరాయకవి గారి ‘వాల్మీకి’ అగ్రగణ్యము.

కథాంశములఁ గల్పించియో యున్నవానిని విస్తరించియో ఒక యితివృత్తమును నాటకముగాఁ దీర్చుటకన్న, మానసికప్రవృత్తి నొక్క దానిం గొని దాని పరిణామంపుఁదెఱఁగు క్రమక్రమముగాఁ బరిశీలకు గోచరించునట్లు దాని చుట్టును సంవిధానము నల్లి నాటకమును సాగించుట కష్టతర మనుట కళాకోవిదుల కెల్లం దెల్లమైన విషయమే. మఱియుఁ దొలినుండి విశుద్ధచరిత్రులుగా నున్నవారు ప్రత్యూహముల సరకుగొనక తమ శీలమును రక్షించుకొనుటయో ప్రలోభములకు లొంగి తమ చరిత్రములు మలీమసములు గావించుకొనుటయో తఱచు గానవచ్చుచుండుఁ గాని, తొలుత దుశ్చరితు లగువారు వెన్వెంట సుచరితు లగుట లోకమునఁ గర మరిదిగాఁ జూపట్టుచున్నది. ఇట్టి చిత్తపరివర్తనము అనేక జన్మములలో నైనట్టి వివిధావస్థలలో జీవునకుఁ గల్గిన భావ

యుండెను. కాని యీ పాలఁతి కుశీలవుఁ డను పేరి యింటిబంటుపై వలపు నిలిపెను. వీ రిర్వురును పూఁదోఁటలో సరససల్లాపము లాడు చున్న దృశ్యమే గృహోన్ముఖుఁ డగుచున్న ప్రాచేతసుని కన్నులకుఁ గాన వచ్చుట దైవికము. అది చూచిన వెంటనే ప్రాచేతసుఁ డొడ లెఱుఁగ నీని యమర్షముతోఁ జమత్కారిణిని నెట్టుకొనుచు నిలు సేరి యిల్లాలి యుపేక్ష కామెం బపెరును. ఏ కర్మము నెఱుంగని యీ మోహనాంగి (ఇదియే ప్రాచేతసుని గృహిణి పేరు) మగని నొకింత శాంతపఱిచి కుమారి నింటికిం బిలుచుకొనివచ్చుటకుఁ గుశీలవునిఁ దానే పంపితి నని చెప్పి 'ఈడుమీఱిన యాఁడుబిడ్డ యడవిలో నొంటరిగఁ దిరుగుచుండిన నే మునికుమారుఁ డేమి సేయునో' యని నర్మగర్భముగాఁ బ్రాచేతసు నెత్తిపొడుచును. కాని ప్రాచేతసుని చిత్తవృత్తి నేఁడు నర్మముల కభి ముఖముగా లేదు. మునిసందర్శనప్రభావ మాతనియెడఁద నడఁగియున్న సాత్త్వికస్వభావమును మేల్కొల్పుచున్నది. "ఏ మునికుమారుఁ డేమి సేయునో" — వీనిని మంత్రాక్షరములఁబోలె ప్రాచేతసుఁడు మననము సేయుచున్నాఁడు. 'ఏ మునికుమారుఁ డేమి సేయునో?' 'ఏ ముని కుమారుఁ డేమి సేయునో' — ఆ మునికుమారుఁడు తానే. కులము గూల్చు కొని తాను చెట్టవట్టిన శబరతరుణియు ఆ మోహనాంగియే. ఆహా! ఒక్క మాటలోన నెంత మార్పు కలిగినది ప్రాచేతసుని హృదయమున! మఱి 'క్వాసి ప్రేయసి! హా కురంగనయనే చంద్రాననే జానకీ!' అని వ్రాసిన జయదేవుఁడు వెట్టివాఁడా యేమి? మోహనాంగికి తన మాటకు పతి యేల యట్లు మ్రాన్పడెనో గోచరింపదయ్యెను. మాటపై మాటగా తన యర్థ మామె యాతనికి విప్పిచెప్పఁజూచును. ప్రాచేత సునకు విపరీతమే స్ఫురించును. ఇది తత్సంస్కారసౌధమునకు రెండవ మెట్టు. గోపాలరాయ లీ సంభాషణము తీర్చిన తీరు ఆతనికిఁ గల మన స్తత్త్వపరిజ్ఞానమును వేనోళ్లఁ జాటుచున్నది.

ఈ నాఁటినుండి ప్రాచేతసునకు శాంతి లేదు. 'పాణి గృహీతి'ని పరిత్యజింతునా? విరాగ మూని యీ విషమబంధములనుండి విముక్తుఁడ నగుదునా? — అని తర్కించి, రెండవదియే కర్తవ్య మని నిశ్చయించు కొని చిరకాలమునుండి యనాదృతమై యున్న యజ్ఞోపవీతము సవరించు

కాని, ప్రాచేతసుఁడు అరణ్యమునఁబడి యెటకేనియుం బోవుచున్నాఁడు. ఎట కేగిన నేమి? తన తలఁపులు తన్ను వెన్నంటవచ్చుచునే యున్నవి! తల్లి లేని బిడ్డనిఁ దన్నుఁ బెంచి పెద్దవానిం జేసిన ప్రచేతసుని యెడఁ దాను చేసిన యపరాధములు, కావించిన వంచనలు — అంతరంగమున నీవఱ కెక్కడ నడఁగియున్నవో అన్నియు నొక్కపరి యుద్బుద్ధములై యతని నులిమివేయుచున్నవి. తన్నుఁ గూర్చిన చింతచే మృతుఁడైన జనయితకుఁ దాను బితృకర్మయుం జేయఁ డయ్యెనే! ఉద్విగ్నహృదయుఁ డైన యాతని కంటికి నరకయాతనల ననుభవించుచున్న ప్రచేతసుని ప్రేతమే కానవచ్చుచున్నది. ఎట్లో హృదయము కుదురు పఱుచుకొని ‘ఈ విమోహకోలాహలముననుండి యెట్లు విముక్తుఁడ నగుదునా?’ అని ప్రాచేతసుఁడు యోజించు తరుణముననే యచ్చటికిఁ గోలాహలుఁడు వచ్చి, తమ ప్రయత్నము లన్నియు ఫలించిన వనియు ‘మహారాజు’ గారు విజయలక్ష్మీకరగ్రహణము చేయవలసిన శుభముహూర్త మాసన్న మగుచున్న దనియు విన్నవించును. కాని, ప్రాచేతసునికిం కెక్కడి రాజ్యకాంక్ష! హృదయతృణకుటీరమును అనుతాపవహ్ని దహించివేయుచున్నది. ఈ ఘట్టమున — ప్రాచేతస కోలాహలులకు గోపాలరాయలు కల్పించిన సంభాషణము తదీయవివేకపరిపాకమునకు వేఱొక దృష్టాంతము.

ప్రాచేతసుఁడు తనకుఁ గలిగిన యీ పరివర్తనమునకుఁ దొల్తఁ దనకు దర్శనమొసంగి తనచే బద్ధులైన మహాత్ముల యనుగ్రహమే కారణమని యూహించి, వారి కట్లు విప్పనతఁడు కాళికాలయము కడ కేగును. కట్టిన కట్లట్లే యున్నవి కాని వా రచట లేరు. ఇఁకఁ బ్రాచేతసుని విషాదము వర్ణింపఁ దరము కాదు. ఇచ్చట గోపాలరాయలు ప్రాచేతస పాత్రమునకు అతిదీర్ఘమైన ‘స్వగత’ మొకటి వ్రాసియున్నారు. చదివియు ఆడినం జూచియు నానందింపవలసిన యీ రుచిరరచనావిశేషమును నేను పొగడి కొంచెపఱుప నొల్లను. దీని నించుక కుంచించిన నింకను జక్కఁగా నుండు నని మాత్రము సూచించుచున్నాను. మెలఁకువయు నిద్దురయుఁ గాని యీ విచిత్రావస్థ నున్న ప్రాచేతసునకు వసిష్ఠుఁడు చెవిలోఁ దారకోపదేశము సేయును. ప్రాచేతసుఁడు విగలిత

వేద్యాంతరముగా నదే మననము సేయుచుండును. ఇది తత్సంస్కార సాధమునకు మూఁడవ మెట్టు. ఈ సమాధినుండి ఇతఁడు మేల్కాను నంతను వసిష్ఠవిశ్వామిత్రులకు మాఱు తన పాదముల కడ స్మృతి దప్పి పడియున్న సతీతిలకమే కానవచ్చును. ఇలు వెడలి వచ్చునపుడు తన త్రోచిన త్రోపునం బడి గాయమైన యామె మేని రక్తచిహ్నములఁ దిలకించి, తన యకార్యమును స్మరించుకొని ప్రాచేతసుఁడు తన్నుఁ దాఁ బొడుచుకొనఁబోవును. మోహనాంగి యీ విపరీతచర్యకెల్ల నా యిర్వురు కాపాలికుల (వసిష్ఠవిశ్వామిత్రులు కాపాలికు లని యామె భ్రమ) ప్రయోగమే కారణము కానోపు నని పతిని హెచ్చరించును. కాపాలికు లన్న మాత్రమున వసిష్ఠవిశ్వామిత్రులు జ్ఞప్తికి రాఁగాఁ దనుపదిష్ట తారకమంత్రము స్మరించుచు, మోహనాంగి నిశ్చేష్టిత యై చూచుచుండ భక్తిపారవశ్యమునఁ బాడుకొనుచు, ప్రాచేతసుఁడు రంగమునుండి తొలంగిపోవును.

ప్రాచేతసుఁడు చిరకాలము తపము చేయును. చుట్టుం బుట్టలు పెట్టియున్న యతని తపఃస్థానము నెట్లో గుర్తించి, శీఘ్రముగఁ బ్రాచేతసుఁడు సిద్ధార్థుఁ డగుట భక్తిమార్గముయొక్క ప్రభావ మని, తత్ప్రవర్తకుఁ డైన నారదునిఁ దలంచుచు వసిష్ఠవిశ్వామిత్రులు ప్రాచేతసుని మేల్కొలుపుదురు. ప్రాచేతసుఁడు పుట్టనుండి వెల్వడును. ఆసమయమున నే నారదుఁ డచ్చటికి వచ్చి వసిష్ఠోక్తమైన వాల్మీకనామమును ప్రాచేతసునికి స్థిరపఱిచి యాతఁడు కావింపవలసిన మహాకార్య మొక్కటి యున్నదని చెప్పి వసిష్ఠవిశ్వామిత్రులు వెంటరాఁ దన త్రోవం బోవును. ప్రభువు విరాగమును గుఱితించి ప్రభుభక్తిపరాయణుఁడు కోలాహలుఁడు తానును విరాగియై భరద్వాజుని పేర వాల్మీకికి శిష్యుఁ డగును.

ప్రాచేతసుఁడు వాల్మీకి యగుటతో నాటకమునఁ బూర్వార్ధము పూర్తి యగుచున్నది. కాని, నారదుని సంకల్ప మింతతోఁ బర్యాప్తము కాలేదు. ప్రాచేతసు నొక్కని నే కాక, తన్మూలమున లోకము నెల్ల నుద్ధరింపవలయు నని యాతని సంకల్పము. అతఁ డీ విషయము ముందే వాల్మీకికి సూచించియున్నాఁడు. తమసా నదీతీరమున నాశ్రమము

కల్పించుకొని యున్న వాల్మీకి ఒకనాఁడు తన శిష్యులతో మధ్యాహ్న సమయమున నదీస్నానమునకేగి క్రౌంచమిథునమున మగదానిం గూల నేసిన బోయవాని నొకని శపించుటయు, ఆ వాక్కు ఛందోబద్ధమైన శ్లోక మగుటయు శ్రీమద్రామాయణము చదివినవారెల్ల రెఱింగిన విషయమే. మఱి యిట గోపాలరాయలు కావించిన కల్పన యే మనఁగా, కుశీలవుఁడే ఆ బోయవాఁ డనుట. వనదేవతగా నున్న వాసంతియే చమత్కారిణి యనుట. అట శబరి పేరఁ దపము చేయుచున్న యా యింతియే మోహనాంగి యనుట. ఇట్లొకొక్కఁడు విషయవాసనలు వీడి వాల్మీకిసన్నిధానప్రభావమునను తదీయమృదులోపదేశమునను అట తుదికి నందఱు పవిత్రులై కృతార్థు లగుచున్నారు. ఇఁక వాల్మీకి యన్ననో, తన వాక్కు శ్లోకరూప మగుట కచ్చెరువుపడి యది నారద ముని యనుగ్రహవిశేషముగా భావించును. అది సరస్వతీపరప్రసాద మని చెప్పి నారదుఁడు వాల్మీకిని దేవిని ధ్యానింపు మనును. దేవి ప్రసన్నయై నారదోపదిష్టమార్గమున శ్రీరాముని చరిత్రను చిత్రింపు మనియు త్వదాశ్రమము తత్కథామార్గముననే ప్రత్యక్షలక్ష్మీవిలాస మందిరము కాఁగల దనియు వాల్మీకి నాశీర్వదించును. వసిష్ఠవిశ్వామిత్రులు నీవుఁ గావించిన మహోపకారమునకుఁ బారితోషికముగా వారి చరిత్రముల రామాయణమునఁ గూర్పు మని నారదుఁడు వాల్మీకి నెచ్చరించును. ఇట్లు రామాయణమహాకావ్యనిర్మాణమునకుఁ బునాది నేర్పఱిచి తాను సృజించిన కోలాహలాదిపాత్రజాతమునకే మాఱు పేరులతో నందు ప్రవేశము కల్పించి గోపాలరాయలు మహాకవిస్తవము తోనే స్వగ్రంథోపసంహారముం గావించుకొనుచున్నారు.

మ. " ధరణిన్ వాఙ్మయపీఠ మెక్కి బహుధా ధర్మంబు శాసించి, త
త్సరణిన్ దూషణభూషణంబు లను శిష్టారక్షు లుద్దించుచున్
సరసామోదము గాఁగ మానవమనస్సామ్రాజ్య మశ్రాంతమున్
పరిపాలించు కవీశు వైభవము విశ్వశ్రేయముం గూర్చుతన్ ! "

ఈ నవసత్కృతిని, ఆంధ్రసభాధ్యక్షులు శ్రీయుత తూములూరు శివరామయ్య పంతులు (బి. ఏ., బి. యల్.) గారి యింటఁ

గూడిన విద్వద్గోష్ఠిలో సముద్రితస్థితియందు యొండు రెండు మాఱులు మాకు వినిచి, దీని యుపోద్ఘాతము వ్రాయను నెల్లూరు శ్రీ యాంధ్ర సభవారిచే నభినీతముం గావింపను గోపాలరావు గారు మమ్ముం గోరి చిర కాల మయ్యెను, మొనమొన్నటి దనుక వారి కోర్కె నెఱవేర్పనోప మికి నాటకసభల కెల్ల సామాన్యము లైన యౌదాసీన్యాదులే కారణ ములు. ఈ నాటకమును సభవారు 1932 సం. అక్టోబరు నెల తే 12 ది నాఁడు సింహపురి పౌరుల మ్రోలఁ బ్రయోగించిరి. ఆనాఁట నాట దిలకింప నాహూత మైన నాగరికవ్రాత మెల్ల నాటకసంవిధానవై దగ్ధికిని కవి గారి హృద్యపద్యధోరణికిని కరము తనిసిరి. చమత్కారిణీ కుశీలవుల వలపుఁబోకడలు ప్రాకృతులకుం బోలె, వాల్మీకి యనుతప్త చిత్తమువలన వెడలిన గభీరభావములు ప్రౌఢుల కాకర్షకము లయ్యెను. పరిమితపాత్రవర్గమై అక్లిష్టసంవిధానసుభగమై యామమాత్రప్రయోజ నీయ మగు నీ చిన్న నాటకము సాయంప్రయోగములకు మిగుల ననుకూల ముగా నుండు ననియు, ఈ నాఁట నికృష్టకృతిలాలసమై జఘన్యముగా నున్న జనుల యభిరుచి సంస్కారముం బొరయు కొలఁది ఈ దృశ్య కావ్యము బహురంగస్థలములఁ బ్రయోగింపఁబడఁగల దనియు నేను భావించుచున్నాఁడను. ఇట్టి యుదాత్తరచనలకుఁ బోషకులై యాంధ్ర భాష కమూల్యవరివస్య సేయుచున్న 'విశ్వదాతృ' మహాశయులు శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులవా రెంతయు ధన్యులు.

నెల్లూరు
1-12-32

దుర్భా సుబ్రహ్మణ్యశర్మ
ఉపాధ్యక్షుఁడు, ఆంధ్రసభ

శ్రీరస్తు

# వాల్మీకి

## పాత్రవివరణము

### పురుషపాత్రములు

ప్రాచేతసుఁడు — ప్రచేతోమహర్షి కొడుకు. కిరాతకన్యను పెండ్లాడి చోరనాయకుఁడై రాజగుటకు ప్రయత్నించుచుండును. వసిష్ఠ విశ్వామిత్రుల సందర్శనసంభాషణాభిమంత్రణములవలన సంస్కరింపఁబడి, గృహచ్ఛిద్రములవలన విరక్తుఁడై, తపస్సు చేయును. (అంకములు I మొదలు V మధ్యమువఱకు.)

వాల్మీకి — ప్రాచేతసుఁడు తపోనంతరము పొందిన పేరు. భక్తిరసైక ప్రచారకుఁడై, నిషాదుని శపించుచు కవియై, సరస్వతీనారదుల చే రామాయణరచనకు ప్రోత్సాహపఱుపఁబడును. (అంకము V మధ్యమునుండి VII చివరివఱకు.)

కోలాహలుఁడు — ప్రాచేతసుని మంత్రి. (అంకములు III, V.)

భరద్వాజుఁడు — కోలాహలుఁడే యీ పేర వాల్మీకి శిష్యుఁడగును. (అంకములు VI, VII.)

వ్యాఘ్రపాదుఁడు — ప్రాచేతసుని సేనానాయకుఁడు. (అంకములు I, III) తుద కదే పేరిట బ్రహ్మర్షి యగును.

కుశీలవుఁడు — ప్రాచేతసుని పరిచారకుఁడు. అతని కొడుకును వలచి, తుదకు పాఱిపోవును. (అంకములు II, IV.)

నిషాదుఁడు — కుశీలవుఁడే పాటిపోయి యీ పేరఁ బరఁగుచు వాల్మీకిచే శపింపఁబడును. (అంకము VI.)

వసిష్ఠుఁడు — విశ్వామిత్రసమేతము నారదప్రేరితుఁడై ప్రాచేతసుని సంస్కరించును. మోహనాంగీచమత్కారిణుల నుద్ధరించును. (అంకములు I, IV.) వాల్మీకి నభినందించి రామాయణరచనకు ప్రోత్సహించును. (అంకములు V, VII.)

విశ్వామిత్రుఁడు — వసిష్ఠుని సహకారి. (చూ. వసిష్ఠుఁడు.)

నారదుఁడు — భక్తియోగమహిమను ప్రకటించుటకై ప్రాచేతససంస్కరణార్థము వసిష్ఠవిశ్వామిత్రులను ప్రేరేపించి, వాల్మీకి నభినందించి రామాయణరచనకు ప్రోత్సాహపఱచును. (అంకములు V, VII.)

సేవకుఁడు — ప్రాచేతసుని బంటు. (అంకములు I, II.)

సైనికులు — వ్యాఘ్రపాదశిక్షితులు, తగునంతమంది. (అంకము I.)

## స్త్రీపాత్రములు

మోహనాంగి — ప్రాచేతసుని భార్య. (అంకములు II, IV.) తుదకు శబరి యగును.

చమత్కారిణి — ప్రాచేతసుని కొమార్తె. కుశీలవుని వలచి, తండ్రిచే తఱుమఁబడును. (అంకములు II, IV.)

వాసంతి — చమత్కారిణియే సంస్కరింపఁబడి, యీ పేర వాల్మీకాశ్రమమున నుండును. (అంకము VII.)

నిషాది — నిషాదుని పెండ్లాము. (అంకము VII.)

సరస్వతి — వాల్మీకికి సాక్షాత్కరించి, రామాయణరచన కతనిని ప్రోత్సాహపఱచును. (అంకము VII.)

శ్రీ రస్తు

# వాల్మీకి

## ప్రస్తావన

ధరణిన్ వాఙ్మయపీఠ మెక్కి బహుధా ధర్మంబు శాసించి, త
త్సరణిన్ దూషణభూషణంబు లను శిక్షారక్ష లుద్దించుచున్,
సరసామోదము గాఁగ మానవమనస్సామ్రాజ్య మశ్రాంతమున్
బరిపాలించు కవీశు వైభవము విశ్వశ్రేయమున్ గూర్చుతన్!

సూత్రధారుఁడు — (నాంద్యంతమునఁ బ్రవేశించి) మారిషా! ఏమి, ఇంకను రాకున్నాఁడవు?

పారిపార్శ్వకుఁడు — (మోము చిట్లించుకొనుచుఁ బ్రవేశించి) అయ్యా! అభివదించుచున్నాఁడను. చెవి నిల్లు కట్టుకొని చెప్పినను, సమ్మతింపవైతివి. కర్తవ్యం బాలోచించుచు నించుక యాలసించితిని, క్షమింపుము.

సూత్రధారుఁడు — ఇంకను నీ వెట్టి తీఱలేదా?

తే. కావ్యముల నాటకం బగ్రగణ్య మండ్రు;
తత్ప్రయోగంబు బోధ కుద్యత్పథంబు;
వృత్తులం దెల్ల బోధకవృత్తి మేలు;
నాటకప్రయోగం బెట్టు నైచ్య మొందు?

పారిపార్శ్వకుఁడు — ఇ దెవరు కా దనిరి ? ప్రయోగ మందు ప్రాఁత దారి పట్టుకొని ప్రాఁకులాడుచు సంతృప్తిపడెడి నీ స్వభావము కళాభివృద్ధి కాతంక మనుటయే నా వాదము. నా మతమం దసంతృప్తియే గురుపీఠము.

తే. క్రొత్త పరిశోధనముల రేకొత్తఁ జేయు;
లసదపూర్వార్థసిద్ధిఁ గైవస మొనర్చు;
నూతనాభ్యుదయముఁ గూర్చి, ఖ్యాతిఁ దెచ్చు;
ధర నసంతృప్తివంటి బోధకుఁడు గలఁడె ?

సూత్రధారుఁడు — నాఁడు సరిగా వినలేదు, ఇదియా నీ వాదము! ఈ చర్చ కిది సమయము గాదు. సభాస్తారు లిప్పటికే కాలవిలంబము సైరింపఁజాలకున్నట్టున్నది. గోపాల రాయకవి కృతజ్ఞతాపూర్వకంబుగ నాగేశ్వరామాత్యున కంకితంబు గావించిన "వాల్మీకి" నామకం బగు నభినవరూపకముం బ్రదర్శించెద మని కదా, వీరి నాహ్వానించితిమి. మఱి, యాలస్య మేమిటికి ?

పారిపార్శ్వకుఁడు — ఏమి! నాటకము నాగేశ్వరాంకితమా ? ఆ మహాత్ముని పవిత్రనామం బిపు డీ విధముగ సంస్మరింపఁగలుగుట భాగ్యవిశేషము.

శా. కాశీనాథకులుండు, సర్వవిధసత్కార్యైకసార్థీభవ
ద్దేశోద్ధారకపట్టభద్రుఁడు, లసద్ధీచాతురీధుర్యుఁ, డా
శాశావ్యాప్తయశఃప్రకాశుఁడు, బుధౌఘారాధ్యుఁ, డాఢ్యుండు, నా
గేశామాత్యుఁడు; తన్మహామహుని నే పేర్కొందగున్ నిత్యమున్ !

సూత్రధారుఁడు — నిజము, నిజము! ఆ మహానుభావుని మహిమ యెంత యభివర్ణించినను, తనివి తీఱదు.

మ. వరసారస్వతలోకభారవహనాన్వర్థంబు నాగేశ్వరో
త్తరనామంబు విరాజిలన్ బ్రబలు నా ధాత్రీసురశ్రేష్ఠునిన్
స్థిర సాక్షాత్కృతి గాంచి మించెడి సురజ్యేష్ఠుం డనన్ జెల్లెడే
పరమామ్నాయములై ప్రబోధ మొనగూర్పన్ *బత్రికల్ నాలుగున్!

పారిపార్శ్వకుఁడు — అది సరే కాని, నిన్నడిగి తెలిసికొనవలసిన విషయ మొకటి కలదు. వల దన్నను వినక యభినయార్థము నీవు నామీఁదఁ బడవైచిన యొక భాగపు కాగితపు ముక్కలనే కాని, నేను గ్రంథమును జూడలేదు. నాట్యకళాపోషకుఁ డగు నాగేశ్వరామాత్యునకుం గృతి సమర్పించి కృతార్థుం డైన యా గోపాలరాయకవి యెవరు?

సూత్రధారుఁడు — భాషాభ్యుదయమునకై పాటుపడుచు, చిరకాలంబుగ చెన్నపురి నున్న కాళ్లకూరి గోపాలరాయకవినే యెఱుంగవా?

పారిపార్శ్వకుఁడు — (నిరసనభావముతో నవ్వుచు) అతఁడా? బాగు బాగు! చిన్నప్పు డతనిని కాకినాడలో చక్కఁగ నెఱుంగుదును! అట్టి మహాకవి నాటకమే కాని, నీ కిపుడు రుచింపదు కాఁబోలు!

* ఆంధ్రపత్రిక — (1) దినపత్రిక, (2) వారపత్రిక, (3) మాస పత్రిక (భారతి), (4) సంవత్సరపత్రిక (ఉగాదిసంచిక).

సూత్రధారుఁడు — మారిషా ! పరిహాసింపఁబూనియు పరమార్థమునే ప్రస్తావించుచున్నాఁడవు సుమా ! నీ యభిప్రాయమేమి ? కావ్యగుణము నిర్ణయించుట కవినిబట్టియా ? విశేషించి, చిన్నప్పుడున్నట్లే మనుష్యుఁ డెల్లప్పుడు నుండు ననుకొనుట కేవలము పొరపాటు.

తే. విప్రుఁ డొక్కఁడు బోయతఁ బెండ్లియాడి,
చౌర్యవృత్తిమైఁ బాపంబు సలిపి సలిపి,
తుదకు వాల్మీకి యను కవీంద్రుఁడుగ మాఱె;
కాలపరిణామమహిమంబుఁ గాంచఁదరమె ?

నీ నిమిత్తము — నీ నిమిత్తమే కాదు, నీవలె విషయపరిజ్ఞానంబు లేకయే వితండావాదము సలుపు సమకాలికుల యందఱి నిమిత్తము — విశ్రుతుం డైన కవిని గుఱించి సైతము విశదపఱచుట యావశ్యకం బగుచున్నది.

తే. దండిభారవిముఖ్యవిద్వత్కవీంద్ర
రమ్యశైలీవిరాజితగ్రంథకర్త *,
అన్యభాషానువాదవిఖ్యాతభావ
ఘనుఁడు †; సామాన్యుఁడే మన కవివరుండు !

---

* ఈ గ్రంథకర్త రచియించిన "వసంతసేన" కుపోద్ఘాతము వ్రాయుచు, శ్రీమన్మహోపాధ్యాయ వేదము వేంకటరాయ శాస్త్రిగారు వ్యక్తీకరించిన యభిప్రాయము.

† ఈ గ్రంథకర్త రచియించిన "అపూర్వసంఘసంస్కరణము"ను బెంగుళూరియందలి "ఆనందచంద్రికా" పత్రికాధిపతులు శ్రీయుత విద్యానిధి కే. శివరామదాసు గారు గ్రంథకర్త యనుమతి గొని కన్నడము లోనికి పరివర్తించిరి.

ఇప్పటికే మితి మీఱి, కాలహరణంబు గావించితిమి. ఇఁక నిర్ణీతవేషధారణంబునకుఁ గడంగుదము. రమ్ము, పోదము.

పారిపార్శ్వకుఁడు — (మోము చిట్లించుకొనుచు) అప్పుడే వేషము వేయ నని నొక్కి వక్కాణించితినే, మరల నన్నేల బలాత్కరించుచున్నాఁడవు? (అనుచు, విముఖుఁడై వెడలఁ బోవును.)

సూత్రధారుఁడు — (పారిపార్శ్వకుని బట్టి నిలిపి) వాదమున భంగపడి పాఱిపోవుట పాఁడిగాదు, కోపగించుటయు గుణము గాదు; మతము మార్చుకొని మహానీయుఁడవు కమ్ము.

తే. సాధురక్షయు దుష్టశిక్షయు ఘటింప
వెన్నఁ డెన్నెన్ని వేషముల్ వేయుచుండె,
కష్టసుఖరూప నాట్యరంగములు చూప
మనము వేషముల్ వేయుట యనుచితంబె?

పారిపార్శ్వకుఁడు — పరమార్థప్రదర్శకంబు లయ్యును, నీ పలుకులు నా కిపుడు రుచింపఁజాలవు. సంసిద్ధమైన ప్రదర్శనము నావలనఁ జెడు నను భయముచే, నిప్పటి కంగీకరించుచున్నాఁడను. నాదృఢాభిప్రాయ మిపుడైన సరిగా వినుము.

తే. నిజపురోవృద్ధి గోరెడి నిఖిలజనుల
కున్నతాదర్శ మెప్పుడు నుండవలయు;
చోరుఁ డయ్యును, రాజు కాఁగోరి, కాఁడె
శిష్టమార్గదర్శకుఁడు ప్రాచేతసుండు?

సూత్రధారుఁడు — (పారిపార్శ్వకుని బుజముపైఁ దట్టుచు) మేల్మేలు! మారిషా, మేల్మేలు! అతినిపుణంబుగ ప్రస్తావించితివి. నీవాక్సుధారసప్రసారము పూర్ణసుధాకరోదయంబును స్ఫురింపఁజేయుచున్నది. (నేపథ్యము వంకఁ జూపుచు) అల్లదె, చూడుము!

తే. ప్రకటసత్సైనికనికాయపరివృతుండు
రాజుగా సోమనాథుండు* తేజరిలెడి!
మఱి, వసిష్ఠాదిసాంగత్యమహిమఁ జేసి
యఖిలకళల రాజాధికుం డగుట యరుదె?

ఇఁక మన మనంతరకర్తవ్యమునకుం గడంగుదము, రమ్ము.

[ఉభయులు నిష్క్రమింతురు.]

* ప్రచేతసుని కొడుకు పేరు.

శ్రీ రస్తు

# వాల్మీకి

## ప్రథమాంకము

( రంగము : అరణ్యమార్గము )

[ సైన్యపరీక్ష సలిపి వెడలెడి ప్రాచేతసుని సాఁగనంప వచ్చిన కిరాతసైనికులు పాడుచు ప్రవేశించెదరు. వారి వెంటనే, సేనానాయకుఁ డగు వ్యాఘ్రపాదుఁడు లయానుసారము కత్తి యాడించుచు ప్రవేశించును. ప్రాచేతసుఁడు రాచఠీవితో ప్రవేశించును.]

సైనికులు —

( హిందూస్థానీ బేహాగ్ రాగము ; అట తాళము )

ప. మారాజ ! మారాజ ! - మ మ్మంపుమా !
పగపుర్వు లేకుండఁ - దెగటార్తుమా ? మారాజ !
చ. కోటల్లో దూఱీన - కొండల్లో దాఁగీన,
మా శేత శిక్కకుండ - మనఁజాలరూ. మారాజ !
2. ఈ శేలతో గ్రుచ్చి - మీ శేతుమా ?
బాకూలతో పొడిచి - పారేతుమా ? మారాజ !
3. శింగాణు లెక్కొట్టి - శెవులూ దాఁకంగ లాగి,
తూపూలతో రూపు - మాపేతుమా ? మారాజ !

4. తీటెక్కి వున్నాయి - తిరిగిన బుజములు ;
పచ్చి నెత్తురు గెందం - బా గంటయీ ! మారాజ !

వ్యాఘ్రపాదుఁడు — ఓయీ ! మీ బుజముల తీఁట తీరెడి దినములు సమీపించుచున్నవి. మహారాజు మన శిబిరములకు విచ్చేయుటయే శుభసూచకము. వేగిరింపకుఁడు.

ప్రాచేతసుఁడు — (మంద స్మితముతో) వ్యాఘ్రపాదా! సమరసన్నాహము లేమేమి యొనర్చితివి ? నా నియోగించిన సర్వకార్యములయం దప్రమత్తుఁడవే కదా ?

[ వ్యాఘ్రపాదుఁడు — సైనికులకు వెంటనే వెడలిపో సంజ్ఞ చేయును. ]

ప్రాచేతసుఁడు — (అది గుర్తించి, యామోదముతో స్వగతముగా) నే నూహించిన ట్లితఁడు మంత్రగోపనదక్షుఁడే.

సైనికులు —

(కల్యాణి రాగము ; రూపక తాళము)

చ. ప్రాచేతసమహారాజును - రాజ్ఞి మోహనాంగిదేవిని
ఉద్దేశాతీతం బగు - నుత్తమపదవిం జేరిచి,
ప. కాళి యొమ్ముతన్ ! - మహా - కాళి యొమ్ముతన్ ! కాళి.
(అని పాడుచుందురు.)

[ ప్రాచేతసుఁడు చిఱునవ్వుతో తల యూఁపి సైనికులకు తన ప్రీతిని వ్యక్తీకరించును. సైనికులు నమస్కారపూర్వకముగ పాడుచు నిష్క్రమింతురు. ]

వ్యాఘ్రపాదుఁడు — స్వామీ! అతిజాగరూకతతోడ నే మెలఁగుచున్నాఁడను. దాడి వెడలఁదలఁచిన రాష్ట్రపు దక్షిణపు టెల్లలో దోపిళ్లు చేయింప నుపక్రమించితిని. ఆ యల్లరు లణఁచుటకై శత్రుసైన్యము సగపాలు రాజధానినుండి బైలుదేఱిన దఁట. మన సైనికులు వేర్వేఱ వర్తించి సమయోచితముగ తదుపాంతకాంతారమందు దాఁగుచుండుటచే, ఆ సగమును ఛిన్నభిన్నము లై వారిని కనుఁగొనలేక సముద్రగతము లైన చేఁపల నన్వేషించున ట్లల్లాడి యాకులు మేయుచున్న దఁట. పశ్చిమరాష్ట్రమువా రొకవేళ పరులతోఁ గలయఁబూనుచో వారి నడ్డగించుటకై, కొంత దళము నా ప్రాంతమందు ప్రచ్ఛన్నముగ నుండఁ బంచితిని. తక్కిన సేనతో రాజధానిని ముట్టడించుటకు సంసిద్ధుఁడనై యున్నాఁడను.

తే. వినయ మనియెడు ముకుఁద్రాడు వెనుక కీడ్వ
యోధవృషభేంద్రతతి నిల్చియుండెఁ గాని,
కయ్యమున కనుక్షణమును గాలు ద్రవ్వఁ
దావకాజ్ఞానిరీక్షణోత్సాహ మడర.

ప్రాచేతసుఁడు — విజయమును కరగత మొనర్చెడి యొక చిన్న యుపాయము మాత్రము మఱచిన ట్లున్నది. మన శబ్దవేధిధానుష్కులకు లక్ష్యము కుదురునట్లు నిపుణులగు యోధులకు సంకేతసింహనాదములు గఱపి, వారిని వైరిరాజుకడ నంగరక్షకోద్యోగము సంపాదింపఁ బంపితివా?

వ్యాఘ్రపాదుఁడు — క్షమింపుఁడు; నేఁడే పంపెదను. (అని విచార మభినయించుచుండును.)

ప్రాచేతసుఁడు — చింతింపకుము. ఇంతకును, కోలాహలుని మంత్రప్రయోగము సైన్యనాశనము లేకయే కార్యసిద్ధిని సమకూర్చునని తోఁచుచున్నది. దేనికిని, నీ ప్రయత్నమున నీ వుండుము.

వ్యాఘ్రపాదుఁడు — మహాప్రసాదము! ఇప్పుడె పోయి, మీ యాజ్ఞ నిర్వర్తించెద.

ప్రాచేతసుఁడు — మంచిది, పోయిరమ్ము.

వ్యాఘ్రపాదుఁడు — (ప్రాచేతసునకు నమస్కరించుచు, నిష్క్రమించును.)

ప్రాచేతసుఁడు — (ఇంచుక యాలోచించి, కత్తిపై కేల్త్రిప్పి జళిపించుచు, స్వగతముగ)

మ. ధరణీరాజ్యము వీరభోజ్యము; భుజాదర్పంబు, ధీ విద్యలున్
పరివారంబు, ధనంబు — సర్వవిధసన్నాహంబు లాయత్తముల్;
నరనాథత్వము గాంచ, కింకను దివాంధంబట్లు లీ కొనసాం
తరమం దుండఁగ నేల? రాజ నగుదున్ సంరంభగంభీరిమన్!

అరిసామంతుల నైకమత్య మొకటియే నా యత్నమున కించుక యంతరాయముగఁ దోఁచుచున్నది. వారిలో నంతఃకలహము లంకురింపఁజేయ నరిగిన చతురుపాయచతురుఁడు కోలాహలుం డేలొకో యింకను రాక యాలసించుచున్నాఁడు? నీటిలో జాడలు దీయు నా వేగులకు సైతము, అతని స్థితిగతులు తెలియరా వయ్యె. (ఇంచుక యాలోచించి) నాకే యతని ప్రయత్నములు ఫలానుమేయములుగ నున్నవే, ఇం కతఁడు

శత్రువుల కంట మట్టి గొట్టి వచ్చు ననుటకు సందేహ మేమి? * * * ఆలస్యమాత్రమే కాని, అర్థసిద్ధికి హాని లేదు. * * * పార్వతీయులతోడి సంధినిమిత్తము సందేశము గొనిపోయిన గుహుఁడు కృతార్థుండై వచ్చెను గదా! మఱి, కిరాతసైనికులు జైత్రయాత్రకు సన్నద్ధులై యున్నవారు. వారి వ్యూహవిన్యాసంబు నయనోల్లాసంబు గావించె. వ్యాఘ్రపాదుని సాంగ్రామిక శిక్షానైపుణ్య మనన్యసామాన్యము. ఎటు చూచినను, అభ్యుదయసూచనలే కాన్పించుచున్నవి. —

చ. పగతుర కంఠముల్ దునిమి, పైపయిఁ బర్వెడి రక్తధారలన్
దగిలి వసంత మాడి, ఫలదానము గాఁగ ద్విజేంద్రదంపతుల్
విగళదరాతిరుండముల పేరిటి కొబ్బరబొండ్లముల్ గొనన్,
మగఁటిమిఁ గట్టెదన్ విజయమంగళసూత్రము రాజ్యలక్ష్మికిన్!

చౌర్యమా! నీ కిదె నా పీడికోలు.

ఉ. నీ యవలంబనంబ నగు నే నిదె నిన్ విడనాడి, రాజనై
యాయువు దన్క నాటవిడు పాయహినాథున కీయఁ బూనితిన్;
నా యెదుటన్ భవాదృశుల నాశము తప్పదు; చావ నేటి కా
చాయను? నాదు మాట విని, చౌర్యమ! చెచ్చెరఁ బాఱిపొమ్మిఁకన్.

(అలికిడి వినినట్లు నలుకెలంకులు కలయంజూచి, నేపథ్యమువంక దృష్టి సారించి) ఏ మిది! ఎవరో యిరువురు సన్న్యాసులు నా పక్కణమునై పేఁగుచున్నారు. నన్నుద్ధరించు నిమిత్తము నా యిష్టదేవతయే వీరిని నా కడ కంపియుండునా యేమి? కాకున్న, కోలాహలుఁ డంపిన గూఢచారులు కావలయు. (నేపథ్యమువంకఁ జూచి) ఎవఁడురా, అక్కడ?

సేవకుఁడు — (ప్రవేశించుచు) శిత్తం, దేవరా!

ప్రాచేతసుఁడు — ఓరీ! ఎవరో సన్న్యాసులవలె నేఁగుచున్నారు. వారి కథ యేమో కనిపట్టి తెలుపుము.

సేవకుఁడు — శిత్తం, దేవరా! (అనుచు, నిష్క్రమించును.)

ప్రాచేతసుఁడు — (చెవి యొగ్గి వినుట నభినయించుచుండును.)

నేపథ్యమున — అయ్యా! ప్రాచేతసాశ్రమ మెక్కడ?

ప్రాచేతసుఁడు — (తుళ్లిపడుచు) ఏమి యీ యరణ్యమంగళోపశ్రుతి! ప్రాచేతసాశ్రమ మఁట! పిలువని పేరంటముగ నరుదెంచి, శుభసంకల్పసమయమం దశుభంబు నలికిన వీరి నాలికలు చీలికలు గావించినం గాని, నా కసి తీఱ నేరదు. (అనుచు, పాఱఁజూచి) ఏమి యీ వింత! వీరు నిర్భీకులై నావైపే వచ్చుచున్నారే! వీరి యుద్దేశ మేమో కనిపట్టెదఁగాక! (అనుచు, రంగములోనే చెట్టు చాటున పొంచుండి యథోచితముగ నభినయించుచుండును.)

[ వసిష్ఠవిశ్వామిత్రులు కాషాయాంబరధారులై, దండకమండలువులతో ప్రవేశించెదరు. ]

విశ్వామిత్రుఁడు — (వసిష్ఠునకు చెట్టు వైపు చూపుచు, జనాంతికముగా) ఇతని నుద్రేకింపఁజేసి యీవలికి లాగుదము. (ప్రకాశముగా) మిత్రమా! సత్యమే, భార్గవ పరంపరానుగతం బగు నతని క్షాత్రపూరితబ్రహ్మతేజ మప్రతి

మానము. కాని, యొక ధర్మసందేహము కలదు; ప్రాచేతసుఁడు విద్వాంసుఁ డందురే, అతని కీ దుర్వృత్తి యెట్లు పట్టుపడెను?

వసిష్ఠుఁడు — ఇది నీ వెఱుంగని విషయమా? శ్రుతము, బుద్ధికి నైపుణ్యము నాపాదింపఁగలదే కాని, శీలమును సంస్కరింపఁజాలదు.

ఉ. వీరునిచేతి కత్తి పృథివీతలరక్షణ సేయు; నద్దియే
క్రూరునిచేత నుండిన, నకుంఠగతిన్ దెగటార్చు సాధులన్;
చోరునిచేత నుండునెడ, సూటిగఁ గన్నమొనర్చు; దోర్గతిసు-
భీరున కాత్మహాని నిడు — విద్యయు నిట్టిది యెల్ల భంగులన్!

ప్రాచేతసుఁడు — (స్వగతముగ) ఏమి వీరి సాహసము! గుహలోనికి ప్రవేశించి సింహసటావలుంఛనము సేయుచున్నారే! ప్రాచేతసుని ప్రతాపము చవి చూచెదరుగాక! (అని కత్తి జళిపించుచు, వారి యెదుటికి వచ్చి, ప్రకాశముగా) దురాత్ములారా! నిలుఁడు, నిలుఁడు! మీ ప్రాణములు మీవి కావు. నా యునికిపట్టునకు వచ్చి, నన్నె త్తిపొడుచుచున్నారా?

తే. కస్తురిని, దుష్టజిహ్వాక్రాంతముల నిడక,
సాధుమృగనాభుల సృజించె స్రష్ట; యైన,
సృష్టిలోపంబు మిమ్ము రక్షింప; దిదిగో,
పట్టి మీ నాల్కలను జీల్చివైచువాఁడ!

(అనుచు, కత్తి యెత్తి వసిష్ఠునిమీఁది కుఱుకఁబోవును.)

విశ్వామిత్రుఁడు — (మందహాస మభినయించుచు, ప్రాచేతసు నభిమంత్రించి, దండ మడ్డుపెట్టును.)

ప్రాచేతసుఁడు — (విశ్వామిత్రుని వైపు తిరిగి, నవ్వుచు) ఓరి వెఱ్ఱివాఁడా! ప్రాచేతసుని ముందఱనా యీ యింద్రజాలము! (ఉభయుల నుద్దేశించి) మీ రెవరు? విప్రవినోదులా, వినోదవిప్రులా?

వసిష్ఠుఁడు — కుమారా! మేము ప్రచేతసుని మిత్రులము. అనాపత్యకముగ నాగ్రహోదగ్రుఁడ వైతి వేల?

ప్రాచేతసుఁడు — (పరిహసించుచు) ఏమి, యీ టక్కరితనము! సప్తర్షికల్పుఁ డైన మా జనకుఁ డెక్కడ, అభావవిరక్తులు మీ రెక్కడ? నా పేరు చెప్పి నా యనుచరుల వలనను, నా తండ్రి పేరు చెప్పి నావలనను, తప్పించుకొని పోఁజూచుచున్న దొంగ సన్యాసులవలెఁ దోఁచుచున్నారు.

విశ్వామిత్రుఁడు — అయ్యా! లోక మొట్టివాని కట్టిదిగనే కనుపట్టును. నిష్కారణము మమ్ము నిందింపఁబోయి, నిన్నే నీవు నిందించుకొంటివి సుమా!

ప్రాచేతసుఁడు — (కత్తి యెత్తుచు దించుచు, తనలో) ఆహా! ఏమి, యీ పరస్పరవిరుద్ధభావసంఘర్షణము!

తే. పట్టరాని కోపప్రకోపమునఁ జేసి
  యీ కృపాణంబు పైపయి కెగయుచున్న,
  వీరితోఁ బ్రసంగించెడి వింత వేడ్క
  దాని దిగఁదీయఁజొచ్చె ననూనరీతి!

(ప్రకాశముగా) ఓరి ధర్మధ్వజీ! కపటార్థమందు ప్రయోగించిన దొంగ శబ్దమును పురస్కరించుకొని, నన్నుపాలంభించుచున్నాఁడవా?

తే. ఎల్ల ధనముల కధికారు లెల్లవారు,
ధనికులు దరిద్రు లనెడి భేదంబు తగదు;
ధనికుల ధనంబు దోఁచి పేదలకుఁ దార్చు
శౌర్యమే చౌర్య; మది తిరస్కార్య మెట్లు?

పూజ్యపాదుఁ డగు కర్దమమహర్షి తంత్రమే నీ బుద్ధి కధిష్ఠేయ మయ్యెఁగా? ఏమి నీ కండకావరము!

విశ్వామిత్రుఁడు — (నవ్వుచు) నీకు మహర్షిమండలములో మఱెవ్వరును గురువులే దొరకలేదు కాఁబోలు! స్తేయమును భయము లేక ప్రస్తుతించుచున్నాఁడవు, దేశ మరాజకం బనుకొనుచున్నాఁడవా యేమి?

ప్రాచేతసుఁడు — నేను ధ్వజ మెత్తిన తరువాత దేశ మరాజకము గాక మఱేమి కాఁగలదు? రాజులను పొగడుటయు చోరులను తెగడుటయు లోకమున కాబాల్యాభ్యస్త విద్య లయ్యెనే కాని, సూక్ష్మదృష్టితోఁ జూచు నెడల రాజత్వము మాత్రము చోరత్వమువంటిది కాదా?

సీ. పరజనసంహారపరధనహరణముల్ - జీవయాత్రకు సుప్రసిద్ధగతులు,
స్వాధికారప్రతిష్ఠాపనంబునకు ని - రంకుశబలమె సమాశ్రయంబు,
స్వజనైకపాలన నిజకార్యసిద్ధికి - సాధారణం బగు సాధనంబు,
భావోపశాంతికి దేవతార్చాదులు - నిరుప మోపాధు, లిర్వురకుఁ జూడ;
పవలు రేయి యనక ధర్మకవచుఁ డగుచు
స్వపరజనవిత్తము హరించు నృపుఁడు, హర్త
తాఁ దమఃకవచుఁడు పరార్థమె హరించు;
దొరనతముకన్న దూష్యంబె దొంగతనము?

కనుకనే, యీ యుభయులను త్రోసిరాజని సమానసంపత్సామ్రాజ్యమును సంస్థాపింప సమకట్టితిని.

విశ్వామిత్రుఁడు — (పరిహసించుచు) మంచి యుపదేశము పొందితివి! ప్రతిరాజద్రోహియు నిశ్లే బైలుదేఱును. అట్టి యేర్పాటునంగాని యాటవికులు కలసిరాఁగరి కాఁబోలు? (అని వికటముగా నవ్వను.)

ప్రాచేతసుఁడు — (స్వగతముగ) ఓహో! ఈ ముసలిగడ్డ మెవఁడో రాజనీతిరహస్యవేత్తగఁ దోఁచుచున్నాఁడు. వీని యంతు కనుఁగొని యల్లాడించెదఁగాక. (ప్రకాశముగా) ఓయీ! ఈ వికటపాండితి న టుండనిమ్ము. నీవు పొందిన యుపదేశము ప్రకారము రాజుల యెక్కు వేమి, చోరుల తక్కు వేమి?

విశ్వామిత్రుఁడు — దిగ్విజయంబువలన నేకచ్ఛత్రాధిపత్యమును, తన్మూలమున విశ్వసౌదర్యమును నెలకొలుపుటయే పారమార్థిక మైన రాజధర్మము. అట్టి పాలకునయే లేని చోరత్వముతో రాజత్వమును పోల్చుట న్యాయమా?

ప్రాచేతసుఁడు — ఏమి, యీ విప్రలాపములు!

తే. అగతికస్థితిచే నెంత యణఁగియున్న,
ప్రతికృతినె కోరు మానవప్రకృతి యెందు;
"భయదజైత్రతచేతను బడయవచ్చు
విశ్వసౌభ్రాత్ర" మను మాట విషపు మాట!

"వీరభోజ్యా వసుంధరా" యను ధర్మసూత్రమున కపార్థ

మేల చేసెదవు ? బలవంతునిదే రాజ్య మని ప్రపంచచరిత్ర ముద్ఘోషించుచున్నది, చూడుము !

వసిష్ఠుఁడు — కుమారా ! నీ వనినట్లు, భోగరోగులు కొందఱు చోరాధములై, వీరశబ్దమునకు విపరీతార్థము కల్పించి, పరరాజ్యాపహరణార్థ మనర్థము గావించుచుండుట యథార్థమే. అట్టివారి ప్రవర్తనమా రాజధర్మమునకు ప్రమాణము ? వీరుఁ డన నే మనుకొంటివి ? పరమదయాళుండైన పరాక్రమశాలి, ఫలానుబంధము లేని పరోపకారి ; ధర్మసంస్థాపనమే యతని జీవితపరమావధి !

ప్రాచేతసుఁడు — (పరిహాసించుచు) ఇవెల్ల దుర్బల వాదములు. ఏకవీరుఁడనైన నాకా యీ యుపదేశములు ? నా కోపాగ్ని నేల రుచిచూడఁ బూనెదవు ?

విశ్వామిత్రుఁడు — వాదదౌర్బల్యము కోపహేతు వగుట సామాన్యమే. ఆత్మస్తుతిపరనిందలే వీరలక్షణము లని నీ భావము కాఁబోలు !

ప్రాచేతసుఁడు — ఏమి ప్రేలితివి ?

తే. విలయకాలరుద్రుం డన, వేఱె లేఁడు ;
  వీనిఁ జెనకిన, జీవించు వెఱవు గలదె ?
  కాచుకొ, మ్మవిధేయాతఁ గన్ను గనవు ;
  త్రుళ్లిపడు నీ శిరం బిదె తునిసి పడును !

(అనుచు, కత్తి యెత్తి విశ్వామిత్రుని నఱకఁబోవును.)

వసిష్ఠుఁడు — (ఒక ప్రక్కనుండి బ్రహ్మదండము చాఁచి, ప్రాచేతసు నభిమంత్రించును.)

ప్రాచేతసుఁడు — (కత్తి జాఱవిడిచి, నిశ్చేష్టుఁడై, యించుక తెలిసి, స్వగతముగ) ఆశ్చర్య, మాశ్చర్యము! ఏమి యీ యకారణమనోవికారము! అనిర్వాచ్య, మనిర్వాచ్యము! వీరి వాదమం దెల్ల సత్యసాటవమే స్ఫురించుచున్నదే, అంతఃకరణవిరుద్ధముగ నెట్లు ప్రవర్తింతును? తస్కరవృత్తిని నేనే త్యజించితిని; పరరాజ్యవిజయోద్యమము సైతము వర్జ్య మనుచున్నారే! మ తేమి కర్తవ్యము?

వసిష్ఠుఁడు — నాయనా! ఆలోచించుచున్నాఁడవా? విశ్వామిత్రునంతటి సార్వభౌముఁడు నిస్సారం బని నిరసించిన రాజత్వము నీ కేమిటికి? రాజవు కాఁగూడనిచో, రాజాధికుఁడ వయ్యెదవు. ఇంతకును, నీకు మహారాజయోగము పట్టనున్న దేమో యెవ రెఱుంగుదురు?

ప్రాచేతసుఁడు — అయ్యా! నా యంతరాందోళన మంతయు గ్రహించితివి; అమేయమహిమాన్వితుఁడ వగుట సత్యము! అయినను, ఐహికసుఖాభిలాషి నగు నన్ను సన్న్యాసిని జేయ వచ్చిన ట్లున్నది. ఇప్పటికిని, మహారాజయోగము పేర, ఆ దురుద్దేశమునే సూచించుచున్నాఁడవు. మీ యార్జవమందు ప్రత్యయము కుదురకున్నది. పాణిగృహీతిని పరిత్యజించుట ధర్మమా మీ సంప్రదాయమున?

విశ్వామిత్రుఁడు — (వసిష్ఠు నుద్దేశించి) చూచితివా మన మిత్రుఁడు మనల నాహ్వానింపకయే కుమారునకు పెండ్లి చేసెను!

వసిష్ఠుఁడు — (ప్రాచేతసు నుద్దేశించి) నాయనా! నీకు వివాహ మెప్పు డైనది? మా కోడ లెవరి కొమార్తె?

ప్రాచేతసుఁడు — (నవ్వుచు) మీ కోడలి సమాచారము నాకు తెలియదు; నా భార్య మాత్రము కిరాత రాజకుమారి.

విశ్వామిత్రుఁడు — (వికటముగా నవ్వుచు) అనఁగా, బోయ దన్న మాట. అగ్నిసాక్షికముగ పెండ్లియాడితివి కాఁబోలు!

ప్రాచేతసుఁడు — (కత్తి యెత్తి చేతఁ బట్టుకొని) చన విచ్చితి నని, అధికప్రసంగ మొనర్పకుఁడు.

ఉ. ఆదికిరాతుఁ డౌ శివుని యన్వయ మే గతి దూష్య మయ్యెడిన్?
వేదమునందు బ్రాహ్మణుని పెండ్లికిఁ గూడని వర్ణ మున్నదే?
తాదృశి సాధ్వి సద్గుణనిధాన మ దేటికి నాదు దృష్టికిన్
జేఁ దగు? నయ్యరుంధతిని జేకొనలేద వసిష్ఠుఁ డర్మిలిన్?

వసిష్ఠుఁడు — (మందహాస మభినయించుచుండును.)

విశ్వామిత్రుఁడు — జగదారాధ్య యైన యీ యరుంధతీదేవి సాదృశ్య మిం దసంగతము. మహావిష్ణువు మత్స్యాద్యవతారము లెత్తినంత మాత్రమున, ఆయా జాతి జంతువు లెల్ల తదాత్మ్యాప్త్యు మందఁజాలునా? అగ్రజాతి కన్యజాతి

ధర్మపత్ని కానేరదు. అందుకు, కిరాతజాతి చాతుర్వర్ణ్య బాహ్యము. సహజముగా, గుణాచారాదులు కులానురూపంబులు గనుక, భిన్నకులుల కనుకూలదాంపత్యమే యసంభవము.

ప్రాచేతసుఁడు — వితండావాదులకు సమన్వయము స్ఫురింపక పోవుట వింత గాదు. ఇటు చూడుఁడు.

చ. అమరుఁ బదార్థకోటికి గుణావగుణంబులు సంసర్గవిశే
షములఁ బురస్కరించుకొని, సాజము గా వని యెంచు, బొగ్గ వ
జ్రము నొక వస్తువే* యయిన, రంగునఁ గాంతిని బాటసంబుఁజన్
సముములు గామికిన్ వివిధసంస్కరణంబులు గావె హేతువుల్?

అచేతనములందు సైతము వర్తించెడి యీ ధర్మ మెుత్తము జీవులయెడ నెట్లు వర్తింపకుండును? సహః ప్రభావంబుచే విశ్వామిత్రుఁడు బ్రహ్మర్షి యగుటయే దీనికి నిదర్శనము. వసిష్ఠ సాన్నిధ్యప్రభావంబునంజేసి యరుంధతీ దేవి జగదారాధ్య యయ్యెనే, మన్నిరంతరసాంగత్యప్రభావంబునంజేసి మోహనాంగీదేవి మాత్ర మేల కాఁజాలదు? లోకము గుడ్డిదైన నేవ రేమి చేయఁగలరు?

విశ్వామిత్రుఁడు — (మందహాస మభినయించుచుండును.)

వసిష్ఠుఁడు — కుమారా! సంసర్గాదులవలన, పాడగుట సులభమే కాని, బాగుపడుట కష్టము. వ్యక్తుల పాత్రత కొలంది, సంస్కారము ఫలించుచుండును. ఆ పాత్రత గాని ఆ ఫలము గాని దృష్టాంతముచే నిర్ణయింపఁదగినది కాదు.

---

* ఆంగ్లరసాయనశాస్త్రమందు దీ వస్తువు పేరు "కార్బను".

ప్రాచేతసుఁడు — అటు రండు దారికి! మొదటనే ప్రత్యక్షప్రమాణ మడిగిన, నెంతయు సంతసించియుందునే! (సాభిమానముగ)

ఉ. నా నలినాయతాక్షి చిననాఁటి దురభ్యసనంబు లౌ సురా
పానము మాంసభుక్తియు వివాహమునాఁడె పరిత్యజించి, బల్
పూనిక నాకడన్ జదువు పోఁడిగ నేర్చి యఖండపాండితీ
మానితమూర్తి యయ్యె; నసమానము తద్గుణ మెట్లు చూచినన్!

పరమపవిత్ర మైన నా సహధర్మచారిణి చరిత్రము ప్రశంసాపాత్రము!

తే. నాకమున కేఁగనీ, మఱి నారకమున
కేఁగనీ — నేనిఁ కెచ్చోటి కేఁగిన సరె —
ఏకగతిఁ నాతోడిదే లోక మనుచు,
నన్ననుగమించు నెపుడు నా నాతిమిన్న!

విశ్వామిత్రుఁడు — ఆహా! ఏమి యీ చరిత్రము! లోకాతీతముగ నున్నదే, నీ వర్ణనమునుబట్టి చూడ!

ప్రాచేతసుఁడు — ఓహో! దురభిమాన ప్రలాపము లనుకొనుచుంటివి కాఁబోలు! నిరూపించి నిన్నేమి చేసెదనో చూఁగుము!

వసిష్ఠుఁడు — కుమారా! ఈ నిరూపణము మాకేమిటికి? ఎవరి యంతరాత్మ వారికే సాక్షి.

ప్రాచేతసుఁడు — (విశ్వామిత్రుని వంకఁ జూపుచు) అతనిచే ననిపింపు మా మాట.

విశ్వామిత్రుఁడు — ఈ సందర్భమం దరుంధతీదేవి మాట యెత్తుట యసంగత మంటినే కాని, నేను మాత్ర మే మంటిని? నీ కక్కఱ లేని పరిశోధనలు మా కేమిటికి?

ప్రాచేతసుఁడు — (వసిష్ఠు నుద్దేశించి) అదిగో, చూడుము! నా కక్కఱ లే దఁట. సత్యాన్వేషణమునకు భయపడుచున్నా నని కదా యతని తాత్పర్యము! ఇదె, పోయి పరీక్షించెద. (అనుచు కొంచెము దూర మేఁగి, స్ఫురణ మభినయించి, వెనుకకు వచ్చి నవ్వుచు) ఆహా! ఎంత నయవంచనము చేసితిరి! 'మీ రెట్లయినఁ దప్పించు కొని పోఁజూచుచున్నా' రన్న నా మొదటి యనుమాన మిపుడు మఱింత బలపడినది. అంతే కాక, న న్నిట్లు నిరుత్సాహపఱుచు నిమిత్తము వైరు లంపిన గూఢచారు లని కూడ సంశయ మగుచున్నది. (నేపథ్యము వంకఁ జూపుచు) అదిగో! అటు చూడుఁడు. ఆ కాళికాలయాంగణమందలి చెట్లకు మి మ్మంటఁగట్టి, యింటి కేఁగి వచ్చి, మీ విషయము విచారించెద; నడువుఁడు.

వసిష్ఠుఁడు — వత్సా! నీ ప్రత్యయము నిమిత్త మెట్టి యత్యయమున కైన సంసిద్ధులము.

ప్రాచేతసుఁడు — నాచేతఁ జిక్కి సంసిద్ధులు గా కేమి చేసెదరు? జేతలకు జితులు దాసు లగుట తప్పదు. మీ బ్రహ్మదండము లడ్డుపడు ననుకొంటిరా యేమి? నడువుఁడా చెట్లయొద్దకు! (నేపథ్యము వంకఁ జూచి) ఎవఁడురా, అక్కడ?

సేవకుఁడు — (ప్రవేశించుచు) చిత్తం, దేవరా!

ప్రాచేతసుఁడు — ఓరీ! వీరి నా చెట్లయొద్దకుఁ దీసికొని వెళ్లి, పగ్గములు సిద్ధపఱుపుము.

సేవకుఁడు — చిత్తం, దేవరా! (అనుచు వారిని తీసికొని నిష్క్రమించును.)

[వసిష్ఠుఁడును విశ్వామిత్రుఁడును ఒండొరుల మోము చూచి చిఱునవ్వు నవ్వుచు సేవకునితో నిష్క్రమింతురు.]

ప్రాచేతసుఁడు — (వసిష్ఠవిశ్వామిత్రుల చిఱునవ్వు గుర్తించి యాశ్చర్యముతో) ఆహా! ఏమి యీ పరిహాస పరిఘూప్రభావము! వాచామగోచరముగ నున్నదే! వీరెవరో మహానుభావులుగఁ దోఁచుచున్నారు.

ఆ. మతి చలించి వివిధగతులఁ బఱ్వడఁ జొచ్చె,
పట్టరాక రసముభంగి దోఁప;
దీని గుళికఁ జేసి, స్థిరమహత్తరసిద్ధి
గాంచవలయు! వీరి మించవలయు!

(అని యుద్ధతుఁడై నిష్క్రమించును.)

శ్రీరస్తు

# వాల్మీకి

## ద్వితీయాంకము

(ప్రథమరంగము : ప్రాచేతసుని యుద్యానము)

కుశీలవుఁడు — (ఆయాసపడుచు, ప్రవేశించి) మోనాంగిదేవి కేం శెప్పేది! లేళ్లు శెల్లాడే బైళ్లల్లో పావురాళ్లు పట్టీలు గొట్టే గూళ్ల కాడా తెట్టమొక మేసుకుని తిరగలాడతుంటదని అయ్యన్నీ యెతుక్కొచ్చా, యక్కడా శిక్కలే దా శెమతాక్కర్ని! * * * యీ సాకుతో దాన్ని సంతోసంగ సూడొచ్చుగం దానుకున్నా. (ఆలోచించి) సూస్తే మాత్రం తీరద్దా నా దుక్కం?

(హిందుస్థానీ తోడి రాగము; ఆది తాళము)

పా. సూస్తున్న దుక్కమే! - సూడకున్న దుక్కమే!
మెళుకువున్న దుక్కమే! - కలలు గన్న దుక్కమే!
మరతు నన్నా మరపు రాదీ - మగువ మర్లూ దుక్కమూ!
యేం సేస్తె తీర్తదో నా - కెరుక లేదీ దుక్కమూ!

శామందు న్నూస్తే కాలయెముణ్ణి సూశినట్టుంటదే కాని, శెమతాక్కరిణ్ణి సూస్తే శిలకపిట్టన్నూశినట్టుంటది! వవ్వావవ్వా!

దాని కాల్యా దాని తళ్యా, దాని వొయిసూ దాని వొయ్యారం — యేత్తలుసుకున్నా, వొళ్లు జలబరిస్తూండది! నొకరోణ్ణి, నా నేం సేశేది? పలకరిద్దమంటే, బయమేస్తది; ఆవూ సెత్తకుండ వూరుకుందమంటే, మర్లుగొన్న మణుసు మనమూ టింటదా? అదేందో, ఆ శెమత్కార్ని వోకోక్కప్పుడు నమలి పిట్ట లాగ వొళ్లల్లా కళ్లు శేసుకుని నాకేశే సూస్తున్నట్టుంటది; నా నోరసూపు సూశేకాడికి మూత్తిప్పుకు నుంటది. సిగ్గయిందీ తెల్దు, బైమయిందీ తెల్దు; వొలిసిందీ తెల్దు, వొల్లందీ తెల్దు. సీమ సిటుక్కు మన్నా వులిక్కిపడి దిక్కులు సూస్తదే కాని, నా నుండే సోటొదిలి కదల్నంటదే! * * * వొకేల దిస్టపడ్డా, శాత్రా లడ్డొస్త యేమో? (ఆలోచించి) శాత్రాలా, గీత్రాలా? అయ్యోర్రికి తెలిస్తే అంకిళ్లదిమేస్తడనే కాని, సొయ్యంవొరా ల్లేవూ? * * * యేరు పొంగితే, వూ రగ్గుద్దా? (నేపథ్యము వంకఁ జూచి, యుప్పొంగుచు) యిద్గో, యిద్గో! నా రంగడికుచ్చు! నా రవ్వలముచ్చు! నా పువ్వులగుత్తి! నాసంగడికత్తి! యిద్గో, యిద్గో! (ఆశ్చర్యపడుచు) నా దుక్కమంతా యాడికి పోయింది? నా బైమంతా యామైపోయింది? వొళ్లంతా వూఁగిపోతూండదే! మణుసంతా మాఱిపోతూండదే! (అటు నిటుఁ జూచి) యెవర్లేరు; యెదటఁబడితే, యేమంటదో? * * * యీ సాట్నుండి సమదాయించుకుంటా. (అనుచు, రంగమందలి వృక్షము చాటున నిలిచి, తొంగి తొంగి వీక్షించుచు యథోచితముగ నభినయించుచుండును.)

వసుత్కారిణి — (ప్రవేశించుచు)

(ముఖారి రాగము; ఆది తాళము)

పా. బ్రాహ్మణూఁడూ గొరికెదాఁకా, - నాయి పెండ్లీ చేసూఁ డుంటూ;
బ్రాహ్మణ మాల్లా - వ్యర్థా మవుతుందే! - ఇది పలుఁదుకుంటే,
చిత్తమేమో - లగ్గారిస్తుందే! - అని యౌర్భుకున్నా,
కాయమంతా - కంపా మౌతుందే! బ్రాహ్మణూఁడూ.

2. ఈ పాపరింట్లో నేనూ డాఁగీ, - నా పనిమిటి నను వెదుకు రాఁగా,
వేడుకగా వెలి - సించే దెన్నఁటికో? - వెను వెంటనె వెళ్లి,
గిలిగింతల చో - క్కించే దెన్నఁటికో? - కొంగేలు పట్టీ,
ప్రీతిగా విహ - రించే దెన్నఁటికో? బ్రాహ్మణూఁడూ.

3. తప్పకా వాఁడైనాఁ గాని, - చక్కని కూతాలూ గాడీ
దిక్కు చూడా - మక్కూ వవుతుందే! - అనుకుందే కాని,
కుల మదేమో - కూడా పెడతుందే! - అంటే నే పోయే,
మనసు తీరే - మార్గం మరి లేదే! బ్రాహ్మణూఁడూ.

4. దారకొమార్తే ననుమా వాఁడూ - తొలఁగి తొలఁగీ పోతుంటాఁడూ;
కన్నెత్తీ నా - తెన్నే చూడాఁడే! - మాటాడితే మంటే,
మాటికీ మో - మాటా మవుతుందే! - నా పాప మేమో?
వొంటరీగా - కంటా చిక్కాఁడే! బ్రాహ్మణూఁడూ.

కుశీలవుఁడు — (చాటాలున నెదుటఁబడి)

పా. తుంటయిల్లూ బారీ కెరసీ - వొంటరీగా కంటాఁబడితే,
యెంటఁబడి యేం - తంటా తెస్తావో? - అది తెలుసుకుంటే,
యింటిలో యేం - కంటాగిస్తాఁడో? - వో లక్ష్మీ! మన యీ
కొంటెపని కొం - పంటించేస్తాదే! తుంటయిల్లూ.

(పాడుచు, పాఱిపోవుటకు సిద్ధపడుచున్నట్లు నటించుచుండును.)

చమత్కారిణి — (దైన్యముతో, నిక్కుచు తాగుచు)

పా. మన మనసూలూ కలసీ మెలసీ — మన మిద్దఱమూ సౌఖ్యాన వుంటే,
తంటా యేడదిరీ — కంటక మేడదిరా! — నా గుండెల్లో నేడే,
భయ మిఁక కేలారీ — పాతీపోకుమురా! — నా మాట వింటే,
ప్రాణదానా — ఫలమూ వుంటదిరా! మన మనసూలూ.

కుశీలవుఁడు — (ముక్కుమీఁద వ్రేలు పెట్టుకొని) యెంత మాటంటివి! అమ్మబాబో! ఆఁడవాళ్ళ కన్నెన్ని గూడుపులు. వాల్చినపుడు వాతేస్తారే కాని, దాయమ్మకుంటే యెఱుఁకలుఁ కుంటరా?

చమత్కారిణి — (కూర్చుండి) ఔను! చిన్నప్పటి నుంచీ నన్నెఱుఁగుదువే, నే నిలా చేసేదాన్నా?

కుశీలవుఁడు — కావులే, పాపం, మొగ్గలాలవు! నీ సూపులే శెపుతుండయి బెగిర్న కొదమలేడి వని. (లేడివైపు మోము వైచుకొని) యి పంతా యేందో గందరగోళం గుండదే!

చమత్కారిణి — అదేం కాదులే! అదిగో, ఆ కోడె యిట్టే చూడు, కొమ్ములతో నెలా గీరుతూందో కొదమ లేడిని! అదేమి టా మూఁతులు నాక్కోవడం? ముద్దులాడడం కాఁబోలు?

కుశీలవుఁడు — (లేడి వంకను చమత్కారిణి వంకను మార్చి మార్చి చూచుచు, మోహావేశ మభినయించుచుండును.)

చమత్కారిణి — (కన్ను గీటుచు) ఆహా! ఏమి దాని సైఁగలు! సయ్యాటలకు పిలవడమా యేం?

కుశీలవుఁడు — (చటాలున చమత్కారిణి దగ్గఱఁ జేరి కొని, స్పర్శసుఖ మభినయించుచు) రా, పోదాం! మా అమ్మ పిల్చుకరమ్మన్నది. (అనుచు, చమత్కారిణి ప్రక్కఁ దానును కూర్చుండును.)

చమత్కారిణి—(స్పర్శసుఖ మభినయించు చుండును.)

ప్రాచేతసుఁడు — (తెరలోనుండి రోషముగా)

తే. నీచగార్దభమా! యందె నిలు మొకింత;
కాల మాసన్న మగుటచేఁ గన్ను గనక
యనలకీలను జెనకఁ బ్రయత్నపడెదు,
నాదు క్రోధాగ్ని కాహుతి వౌదు విగిగో!

కుశీలవుఁడు — (ఉలికిపడి లేచి, గొంతు త్రొక్కు లాడుచు) ఆఁడుగో, ఆఁడుగో! బాబో స్తుంపేఁసు! ఇంక కే ముండదది! పోయినయి, పోయినయి! పంచప్రాణాలూ పోయినయి! (అనుచు, నేపథ్యమున కెదుటివంకఁ బాఱిపోవును.)

చమత్కారిణి — (భయవిహ్వలయై లేచి, గొర త్రొక్కు లాడుచు) ఏ వైపునుం, చే వైపునుంచి? (అనుచు, ప్రాచేతసున కభిముఖముగా నేపథ్యమువంకఁ బాఱిపోవును.)

ఇది ప్రవేశకము

(ద్వితీయరంగము : ప్రాచేతసగృహాంగణము)

మోహనాంగి —— (సొక్కుచు సోలుచు ప్రవేశించి)

తే. అక్కటా! విప్రయోగతాపాతపమున
ప్రాణపల్లవములు కడు వాడఁజొచ్చె;
ప్రియుఁడు వీనిని దర్శనామృతసువృష్టి
నెన్నఁ డుజ్జీవితములఁ గావించువాఁడొ?

ఆహా! ఎంత కాల మాయెఁ జెప్పిన గడువు దాఁటి! నాథున కింటిపై గాలి యెప్పుడు మరలునో తెలియదే! దిన మొక యుగంబుగ నున్నది! * * * నిముసము సేపు కనఁబడకున్న వెదకికొనుచు వచ్చెడివాఁడే! ఇప్పు డా యాత్ర మంతయు నే మైపోయెనో? (ఆలోచన మభినయించుచు) ప్రకృతపరిస్థితులం బట్టి చూడ, అతఁడు తిరిగి వచ్చుటయే సంశయాస్పదముగ తోఁచుచున్నది. * * * ఆటవికనైన నే నీ వనలతాంతములతోఁపాటిట్లే మ్రగ్గవలయుఁ గాఁబోలు? ఎంత పరా, కెంత పరాకు! (అనుచు, చెవి యొగ్గి శ్రవణ మభినయించుచుండును.)

ప్రాచేతసుఁడు —— (తెరలోనుండి సక్రోధముగ) ఆ స్వామిద్రోహి నన్ను తప్పించుకొని యెందు పోఁగలఁడు? వాని కండలు చీల్చి చెండాడెదఁగాక!

మోహనాంగి —— (హర్షోత్ఫుల్లనయన యగుచు) ఏమి నా భాగ్యము! ప్రాణేశుని కంఠధ్వనివలె నున్నదే! ప్రళయపర్జన్యునివలె గర్జించుచున్నాఁడు! క్రోధకఠోరభాషణములు కూడ సుధామాధురీధురీణములుగ నున్నవి! కాని,

యెవనికో యీయువు మూఁడినది. * * * నా సిద్ధపఱచి యుంచిన యర్ఘ్యపాద్యాదులు ప్రియుఁడు వచ్చులోపలఁ దెచ్చి, యెదు రేఁగెదఁగాక! (అనుచు, ఇంటిలోనికి నిర్గమించును.)

ప్రాచేతసుఁడు — (సక్రోధముగ, చమత్కారిణిని నెట్టుకొని ప్రవేశించుచు)

ఉ. ఓసి దురాత్మురాల! బ్రతు కొల్లనె ? నిన్నడిదియాసఁజేసి పూ
జాసుమవల్లిగాఁ దలఁచి సాఁకిన నా గరువమ్ము సమ్ముగా,
వాసియు వన్నెయున్ గులము వర్తన మెంచక, సాహసించి యా
దాసుఁడు కేలు వట్టికొనఁ, దద్దయు నవ్వుదు మిన్న కుందువే ?

కన్నకడు పగులఁజేసి, చేసేత నీ ప్రాణములు దీయుటకు మన సొప్పుకున్నది. ఓసి కులకలంకమా! కన్నతండ్రి గౌరవము సైతము పాటింపవైతివి. జాతిరత్నంబ వని, భ్రమించి సువర్ణ భూషణంబుగఁ జేయ నెంచితినే కాని, కాలఁ ద్రోచివేయఁ దగిన గాజుపూస వని గ్రహింపనైతిని.

మోహనాంగి — (మరల ముంగిలిలోనికి వచ్చిచూచి, వివర్ణయై చేతిలోని పళ్లెర మొకమూల నుంచి, చేతులు నులుపు కొనుచు, స్వగతముగ) దైవమా! ఏమో యుపద్రవము వచ్చిన ట్లున్నది!

ప్రాచేతసుఁడు — (చమత్కారిణిని మోహనాంగి వైపు త్రోయుచు) చూచితివా దీని దుర్నయము?

మోహనాంగి — నాథా! నీ కింత యాగ్రహము వచ్చుట కేమి కారణము?

ప్రాచేతసుఁడు — ఓసి దురాత్మురాలా! తప్పు విచారించి దీనిని దండింపక, నా కాగ్రహము వచ్చిన దని నన్నెత్తి పొడుచుచున్న దానవా? నీవే సర్వానర్థములకు కారకురాలవు! ఈడు వచ్చిన యాఁడుబిడ్డ యేమి చేయుచున్నదో గుర్తింపక, నీవు చేయుచున్న యుద్యోగ మేమి? (చమత్కారిణిని కొట్టి తన్నుచు) ఛీ! పశువా! పొమ్ము. నీ ముఖము చూచిన, పాపము! ఇఁక నా యెదుట నుండిన, ప్రాణహానిము చేసెద!

చమత్కారిణి — (ఏడ్చుచు, ఇంటిలోనికి నిష్క్రమింపును.)

ప్రాచేతసుఁడు — (మోహనాంగి వైపు తిరిగి, తీవ్ర స్వరముతో) తల్లికి బుద్ధి యుండినఁ గదా, పిల్ల ననవలయు!

మోహనాంగి — నాథా! నీ వేమో చెప్పుచుంటివే కాని, అది చేసిన తప్పు నా కిప్పటికిని తెలియలేదు.

ప్రాచేతసుఁడు — ఓసి గ్రుడ్డిదానా! కనులు తెఱచుకొని చూచుచు, నన్నడిగెద వేటికే? ఉత్తమబ్రాహ్మణ కుమారున కిచ్చి యుద్వాహ మొనర్పవలె నని నేను విశ్వప్రయత్న మొనర్చుచుండ, అది దాసీపుత్రునితో విహరించుచుండుటను నీవు కనుపెట్టకుంటివి!

మోహనాంగి — నాథా! కుశీలవుని నేనే పంపితిని.

ప్రాచేతసుఁడు — నీవే పంపితివా? ఓసి ప్రాచేతసకుల ధూమకేతువా! కావుననే, వాని కా ధైర్యసాహసములు? ని

న్నిఘ) డేమి చేయవలెను? (అనుచు, గ్రుస్త త్రిప్పి యూడు గఱచును.)

మోహనాంగి — నాథా! నాథా! నే నిం దేమియు తప్పు చేయలేదే, గ్రుడ్లేల యట్లు త్రిప్పెదవు? నెత్తురు గాఱున ట్లపుడు గఱచెద వేటికి?

ప్రాచేతసుఁడు — (తీవ్రముగ) నీవే పంపితివా?

మోహనాంగి — నాథా! నేనే పంపితిని. మనయింటఁ బుట్టి పెరిఁగి బిడ్డవలె మనతోఁ పాటు మసలుచున్నవానిని పంపుటలో దోష మేమి? దీని కేల యింత క్రోధమూర్తుఁడ వగుచున్నాఁడవు?

ప్రాచేతసుఁడు—(ఉగ్రమూర్తియై, పిడికిలి బిగించును.)

మోహనాంగి — అయ్యయ్యో! పిడికిలి బిగించుచున్నాఁడ వేటికి? నా కేమో మూఁడినది!

ప్రాచేతసుఁడు — (కత్తి యెత్తఁబోవును.)

మోహనాంగి — ప్రాణేశ్వరా! వధ్య నగుదు నేని, ఈ శుష్కకృపాణ మేల? నన్ను పలుమాఱు గౌరవించిన యీ బాహువులతోడనే సంహరింపుము. ఇదియె నా ప్రార్థించెడి వరము. (అని యేడ్చుచు, ప్రాచేతసుని చేతులు తన కంఠము నకు తగుల్చుకొనును.)

ప్రాచేతసుఁడు — (గొంతు పిసికి చంపఁబోయి, మోహనాంగి దృష్టుల ననిమేషుఁడై చూచి, చేతులు సడలించి,

పశ్చాత్తాప మభినయించుచు) ఆహా! ఎంతటి ఘోరకర్మము నకుఁ బూనుకొంటిని!

తే. రాగసౌరభమయసుమనోగుణాఢ్య
 మత్సరీరంభదామసమ్మాన్య మైన
 కంఠ మక్కటా! నిర్హేతుకముగ నదిమి,
 కరుణ యెఱుఁగని క్రూరమృగంబ నైతి!

(మోహనాంగి ననునయించుచు)

చ. ప్రణయిని! సైఁపుమా! నిరపరాధవ యాదువు, నీ పవిత్రపీ
 క్షణములె నీ యనింద్యతను జాటెడిఁ; జెంపునఁ జంపనైతిఁ ద
 త్క్షణ, మదె భాగ్యమిం; దయినఁ, గ్రౌర్యశిఖిం బొలిగొన్న బాష్పపుం
 గణములె యేర్చెడిన్ శిఖిశిఖాగతి నా యనుతప్తచిత్తమున్!

మోహనాంగి—(కన్నీరు క్రమ్మిన కనులతో మంద హాసము చేయుచు) నాథా! ఈ నీ ప్రణయవినోదములు నాకు వింతలా? ఏ మేఘుఁడు చుఱుకుఁజూపుల మెఱయించి గభీర గతి నుఱుముచున్నాఁడో, ఆ మేఘుఁడే యాతప్తజీవితముల రసరాగభరితములఁ జేయుచున్నాఁడు.

ప్రాచేతసుఁడు—(మోహనాంగి కన్నీరు తుడుచుచు, చుబుకము పుణుకుచు) ప్రేయసీ! నీ యౌదార్యము చూడ, నాకు లజ్జ వొడముచున్నది. అఘోరక్రౌర్యమం దనురాగాతి శయ మారోపించెద వేల? * * * కాని, యీ పాపిష్ఠుని క్రౌర్య మెంత దుస్సహమో, అనురాగము నంత దుస్సహమె!

మోహనాంగి—నాథా! భర్త యనురాగము దు స్సహము గావలయు ననియే కదా, భార్య సర్వదా కోరు

చుండును! కాని, నా భాగ్య మేమో, తద్విపరీతఫలమే నాకు సిద్ధించుచున్నది. (అనుచు, కన్నీ రొత్తుకొనును.)

ప్రాచేతసుఁడు — కార్యాంతరవ్యగ్రతచేఁ గలిగిన యీ యల్పవియోగమునకై యింత చింత యేటికి?

తే. ప్రాణసఖి! యున్కిపట్లు దూరంబు లైన,
ప్రణయభావము లెట్లు దూరంబు లగును?
నే నెచట నున్న, నీ కనీనికల బెడఁగ
ప్రతిఫలించెడి హృదయదర్పణమునందు!

(అనుచు, కౌఁగిలించుకొనఁబోవును.)

మోహనాంగి — (ఇంచుక నిమీలితనేత్రయై సౌఖ్య మభినయించి, మెల్లఁగ వారించుచు రోషముతో) మాటలతో మాధుర్యము కురియించుచుందువే కాని, కార్యములందు మాత్ర మంత మార్దవము కనఁబడదు.

ప్రాచేతసుఁడు — (మరల చేతులు పట్టుకొని, అనునయించుచు) ప్రాణేశ్వరీ! నీ వాల్గన్నులాన, చెప్పుచున్నాఁడను! నా చేయు ప్రయత్నము లన్నియు నీకొఱకే! నే నెచ్చోట నున్నను, నీ తలఁపే! అది యొకప్పు డించుక కార్యహానికిఁ గూడ కారణ మగుచున్నది.

మోహనాంగి — అయ్యో, పాపము! నా నిమిత్తము కార్యహాని గావించుకొన నేటికి? సర్వానర్థములకు నేనే కారకురాల, నేమి చేయుదును? (అనుచు విషాద మభినయించును.)

ప్రాచేతసుఁడు — ప్రేయసీ! నా యభిప్రాయము గ్రహింపకయే నోనాడెద వేటికి? రాజ్యము సంపాదించి, నాగరవధూపరి * * *

మోహనాంగి — (ప్రాచేతసుని వాక్యము ముగియక మునుపే యందుకొని) రాజ్యము సంపాదించిన పిమ్మట, నాగర వధూ * * * కాక, మఱే మున్నది? నీవు లేదనుచున్నను, నీ వాగ్ధోరణి తెలుపుచునేయున్నది నీ భావమును. (కన్నీరొత్తుకొనుచు) నవనవరసానువర్తి యగు పురుషచిత్తవృత్తిని నమ్మి మోసపోవని వనితయుఁ గలదా?

ప్రాచేతసుఁడు — ప్రాణేశ్వరీ! చెప్పునది పూర్తిగ వినకయే, దారుణవాక్కులన న్నిట్లుల యుఱికించెదవు?

మోహనాంగి — పాపము! నీ దారుణకార్యములఁ బోలఁ జాలవు కాఁబోలు, నా దారుణవాక్కులు! నేను కనఁ బడఁబట్టి సరిపోయె; లేకున్న, నిమిషములో పిల్ల ప్రాణములు నిలువునఁ దీసియుందువే! ఏ మది చేసిన దోసము?

ప్రాచేతసుఁడు — (రోషోద్వేగముతో) ఓసి దోషైక పక్షపాతినీ! దాని యకార్య మింకను నీకు గోచరింపనేలేదా? ఆ దాసీపుత్రుఁడు దాని చెయి పట్టుకొని * * *

మోహనాంగి — (ప్రాచేతసుని వాక్యము ముగియక పూర్వమే యందుకొని) ఇంటి కీడ్చుకొని రమ్మని నేనే పంపితిని వానిని. ఈడు మీఱిన యాఁడుబిడ్డ యడవిలో నొంటరిగ తిరుగుచుండిన, (అవ్వలి మొగమై, నవ్వుచు) ఏ ముని

కుమారుఁ డేమి చేయునో యెట్లెఱుంగవచ్చును? లోకవృత్త మును కనుపెట్టి కదా పిల్లల దిద్దుకొనవలయును!

ప్రాచేతసుఁడు — (టోపి తీసి పాఱవైచి, మ్రాన్పడి చూచుచుండును.)

మోహనాంగి — మన జాగరూకతలో మనము లే కున్నచో, ఎవరి నేమని యేమి ప్రయోజనము?

ప్రాచేతసుఁడు — (ఆకసము వంకఁ జూచుచు) ఏ మునికుమారుఁ డేమి చేయునో! ఏ మునికుమారుఁ డేమి చేయునో! * * * లోకవృత్తము! (ఇటు నటుఁ దిరుగుచు, అంగి విప్పి పాఱవైచి, నిట్టూర్పు నిగుడ్చుచు) లోకవృత్త మైనదా మునికుమారుల చెయ్దములు? నే నెంత నిర్భాగ్యుఁ డను! కులకళంకమ నైతినే! నా చేఁతలే న న్నెత్తిపొడుచు టకు సామెత లయ్యెఁగా!

మోహనాంగి — (భయకంపముతో) నాథా! నాథా! ని న్నేమియు ననలేదు, లోకవిహిత మైన మాట చెప్పితిని. క్షమింపుము! (అనుచు, మోఁకరించి ప్రాచేతసుని పాదములపై వ్రాలును.)

ప్రాచేతసుఁడు — (మోహనాంగిని గుర్తింపకయే) లోకవిహిత మైన మాటయా? అహో! ఎంత ప్రమాద, మెంత ప్రమాదము! ఎవ తె నిమిత్తము జాతిమతాభిమానములు పరిత్యజించితినో, అది యేనా — ఆ మోహనాంగి యేనా —

యిట్లు పలుకుట! * * * నా మోహనాంగియేనా ? (అనుచు, సందేహముతో మోహనాంగి మో మెత్తి చూచును.)

మోహనాంగి — నాథా! నాథా! తెలియక చేసిన తప్పు క్షమింపుము.

ప్రాచేతసుఁడు — (మోహనాంగి మాటలు వినకయే) ఆ మోహనాంగియే! ఆ సోయగపు కన్నులే, ఆ మురిపెంపు ముంగురులే! సందియము లేదు, నా మోహనాంగియే! కాని, అనాలోచితముగ కాలము గడపిన నాకు తగిన శాస్తియైనది.

చ. అధమకులాంగనావరుఁడ నాటకుఁ జింతిలఁ గాని, యోర్మిమై
వధువున కగ్రజాతిగతి వాటిలఁజేయక, కామకాంధతన్
విధిమితి మించి తచ్ఛబరవృత్తి గ్రహించి సుఖింపఁబూని, యీ
విధ మగు దుస్స్థితిన్ గనిన వెంగలి నైతి నటంచుఁ గుందెదన్!

మోహనాంగి — నాథా! ఈ విచార మేటికి? నీవు నాకొఱ కొనర్పని దేమి కలదు?

ప్రాచేతసుఁడు — ఇంతీ! ఎంతయు నిజము! నీ నిమిత్తము నే నొనర్పని కార్యమే లేదు. నీకు చీనాంబరమణిపరిష్కారములు కూర్చుటకై దారులు దోఁచితిని; నిన్ను శ్రీమంతురాలిని జేయుటకై కోటలు పేఁటలు కొల్లగొట్టితిని; పట్టమహిషిని గావించుటకై యేతద్వనోపాంతరాష్ట్రములపై దండెత్త నుద్యమించితిని. ఇదంతయు దారి తప్పిన దుర్వ్యాపారమే కదా? నిన్నుద్ధరించుటకు మాఱు నన్నధఃకరించు

కొని, మునికుమారు లన్న యువతిజనంబుల గుండెలు తల్ల డిల్లున ట్లొనర్చితిని! ఎంతటి మహాపాతకుఁడను!

మోహనాంగి — నాథా! పరిహాసోక్తి కింత విపరీతార్థము కల్పించి, యిట్లాగ్రహించుట పాడియా?

ప్రాచేతసుఁడు — ఓసి వెఱ్ఱిదానా! నీ వంటి వని నా కణుమాత్ర మాగ్రహము లేదు, నీవు నాకు మహోపకారిణివి!

తే. నాఁడు లావణ్యరససుధార్ణవతరంగ
డోలికల నూఁచితివి నన్నుఁ గేలువట్టి!
నేఁడు పశుబలాంధతఁ బాపి నిజముఁ జూపి
నన్ను దిద్దితి జ్ఞానాంజనంబు వెట్టి!

(ఆకాశము వంకఁ జూచుచు) నా యథార్థస్థితి యిపుడు గదా గోచరించుచున్నది! అహో! ఎంతమంది జీవుల హింసించితిని! ఎంత విత్త మపహరించితిని! ఎంత పాపమున కొడిగట్టితిని! కొండల కోట్లవలె పెరిఁగియున్నదే, ఇ దంతయు నే నెట్లు భరింతును!

మోహనాంగి — (ప్రాచేతసుని చేయి పట్టుకొని) నాథా! నాథా! ఈ దాసురా లుండ, నీ కీ విచార మేటికి? సాధ్య మగుచో, అ దంతయు నామీఁద నే మోపుము.

ప్రాచేతసుఁడు — సాధ్య మగుచో! సాధ్య మగుచో! నిజము, నిజము! తన్వీ, యెంతయు నిజము! అ దెట్లు సాధ్య మగును? ఎంత మూఢుఁడ నైపోయితిని! దక్షిణహస్తమా! నిరతిశయబలసుదోద్వేగంబున మన్ను మిన్ను గానక నీవు

చేసిన క్రూరకృత్యముల ఫలము, నీవు గాక, మరెవ రనుభ వింపఁగలరు? (అని తీవ్రాలోచనతో నిటు నటుఁ దిరుగు చుండును.)

మోహనాంగి — (స్వగతముగ) అయ్యయ్యో! ఇ దేమి నా గ్రహచారము! నే నే మన్నను, ఇతనికి విపరీ తార్థమే స్ఫురించుచున్నదే! దైవమా! న న్నేల యిట్లు పరిశోధించెదవు?

సేవకుఁడు — (రోఁజుచు, ఆత్రముతో ప్రవేశించి) దేవరా, దేవరా! యేం శెపుదును! నాల కడ్డపడతుండది! శెమత్కార్నమ్మ * * * శెమత్కార్నమ్మ * * *

ప్రాచేతసుఁడు — (సేవకుని చూడకయే, తన భావ ధోరణిలో) బ్రహ్మ బ్రహ్మ యని మొత్తుకొందురే కాని, ఎవరి తలవ్రాఁత వారు వ్రాసికొన్నదే! (అని యాలోచించుచు నిటు నటుఁ దిరుగుచునే యుండును.)

మోహనాంగి — (ప్రాచేతసుని మాటల కచ్చెరువడి, సేవకుని చూచి యాత్రముతో) చమత్కారిణి కేమి, చమ త్కారిణి కేమి?

సేవకుఁడు — యమ్మా, యమ్మా! యంత శెప్పినా, యిన్లే! యాందో మునిగిన్లాగ, యాడస్త పోతుండదా గుడేపు!

మోహనాంగి — (ఆత్రముతో) అయ్యో! అయ్యో! తండ్రి తన్నె నని గుడికోనేటిలో దూఁకునా యేమి? ఎక్క డెక్కడ? పద పద!

సేవకుఁడు — శిత్తం, శిత్తం! (అని దారి చూపుచు, ముందు నడచును.)

[ మోహనాంగి సేవకు ననుగమించును. ]

ప్రాచేతసుఁడు — వారు వ్రాసికొన్నదేనా? వారు వ్రాసికొన్నదేనా! * * * అటైన, ఏల మరల సరిగా వ్రాసికొనరాదు? ఇది మొదలు సవరించి వ్రాసికొనఁ బ్రయత్నించెదఁగాక! ఋషిరాక్షసుఁ డగు విశ్వామిత్రుని మహాప్రయత్నమును మఱపించెదఁగాక! సంసారరూపమైన పూర్వలలాటరేఖను తుడిచి వేయుటయే పునర్విలేఖనకార్యారంభము! (ఆలోచించి) కాని, తుడిచివేయుట యెట్లు?

చ. చిరము సుఖంబు గూర్చినది చేడియ, కన్నది బిడ్డ; నేఁ డెటో
కరము విరాగినై, యపు డకార్య మొనర్చితి నంచు, వీరి ని
ష్కారణముగాఁ ద్యజించుటకు సౌహృద మొప్పదు; పొమ్మటంచు వి
స్ఫురితవిరక్తి నన్ దఱుమఁజొచ్చె; నహో! యిఁక నేమి చేయుదున్?

(ఇంచుక కనులు మూసికొని, మరల తెఱచి)

ఆ. వెడలిపోయినట్లు వెడలుచున్నట్లు
వెడలఁబోవునట్లు వెట్టివోలె
వివిధగతుల ననుభవించుచుంటిని గాని,
కదలకుంటి బొమ్మ కరణి నిటనె!

(ఇంచుక యాలోచించి) అహో! చిరపోషితము లగు మోహవల్లరు లెంత త్రెంచినను తెగక క్రొత్త క్రొత్త మార్గముల నెగఁబ్రాఁకుచున్నవే! * * * నాకీ వెట్టి సందియ మేటికి? ఎవరి తలవ్రాఁత వారే వ్రాసికొనుచుండ, వీరి గతికి నేనా కర్తను?

అప్రయత్నముగ లభించిన వైరాగ్యదండము నూఁతగాఁ గొని, యీ యసారసంసారజంబాలపటలంబునుండి బహిర్గతుండ నగుటయే కర్తవ్యము! (అనుచు కత్తి పాఱవైచి, యజ్ఞోపవీతమును సవరించుకొనుచు) యజ్ఞోపవీతమా! నిన్నింత కాలమనాదరించి, నేనీ యధోగతిపాలైతిని; ఇఁక నా కవలంబనంబవైన నన్నుద్ధరింపుము!

తే. కొలత పనికి బీగము కట్టుకొనెడి కొఱకు
నిన్నుఁ దాల్చితినే కాని, నీవ చూడ
నప్రమేయమవైన జ్ఞానార్థపేటి;
వఖిలదైవత్యమూర్తి! తుభ్యం నమోఽస్తు!

(అనుచు, నేపథ్యము వంకఁ జూచి నమస్కరించి, యానందించుచు) ఏమి నా భాగ్య, మేమి నా భాగ్యము! గాయత్రీదేవీ! ఇదె వచ్చుచున్నాఁడ! (అనుచు, చటాలున నిష్క్రమించును.)

శ్రీ రస్తు

# వాల్మీకి

## తృతీయాంకము

(ప్రథమరంగము: అరణ్యమార్గము)

కోలాహలుఁడు — (ఉత్సాహముతో ప్రవేశించుచు, స్వగతముగా)

ఆ. క్రూరసత్త్వములను ఘోరభూతములను
తన వశం బొనర్చుకొను నరుండు;
ప్రాజ్ఞునకు జయింపరాని దేదియు లేదు,
తగినవాఁడె తుదకు మిగులువాఁడు!

ఆరంభదశయందించుక నిరాశ కలిగించినను, నా యత్నోపాయము చివరకద్భుతముగ ఫలించినది! మహా ప్రాచేతసుఁడు మహారాజగు ననుట కింకేమి సందియము గలదు? అందఱును నా రాక కెదురుచూచుచుందురు. (అనుచు, సత్వరముగ వెడలఁబోయి, నేపథ్యము వంకఁ జూచి నిలిచి) ఏమిటి! ఇతఁడిప్పు డింత పరధ్యానముగ నీ వంక కేల వచ్చుచున్నాఁడు? నిన్న ప్రాచేతసుఁ డితనితో సైన్యశిబిరములం దుండెనని కదా, వేగులు విన్నవించిరి! ఇతని యీ యాకస్మిక ప్రవృత్తికి నిమిత్తమేమో తెలియకున్నది! (అనుచు, తొలఁగి నిలుచుండును.)

వ్యాఘ్రపాదుఁడు — (ఆత్రముతో ప్రవేశించి, కోలాహాలుని చూడకయే పోవుచుండును.)

కోలాహాలుఁడు — వ్యాఘ్రపాదా! ఇంత యాత్రముతో నేఁగుచున్నాఁడ వెక్కడికి? దారిలో నున్న నన్నే చూడవైతివే!

వ్యాఘ్రపాదుఁడు — (ఆత్రముతో తిరిగి చూచుచు) అయ్యా! కోలాహాలుఁడవా? (గుర్తించి, నమస్కరించి) పండే కద నీ పోయిన పని?

కోలాహాలుఁడు — నన్నుఁ జూచి కూడ సందేహించుచున్నాఁడవా?

వ్యాఘ్రపాదుఁడు — అయ్యా! క్షమింపుము. చెప్పుటకు నోరాడకున్నది. అమంగళము శమించుఁగాక! మన ప్రాచేతసుఁడు సన్న్యాసి యయ్యె ననియు మన మందటము నతని శిష్యుల మైతి మనియు నిన్న రాత్రి యొక పాడు కల గంటిని. తద్దోషపరిహారార్థము దేవీదర్శనంబున కేఁగుచు, ఆకస్మికముగ నిన్నుఁ గలసికొంటిని. ఆ నా యాత్రములో నటు లడిగితినే కాని, యన్యము గాదు సుమా.

కోలాహాలుఁడు — ఓయి వెఱ్ఱివాఁడా! దీనికా యింత చింతించుచున్నాఁడవు! ఎల్ల పక్కణము లేక కుటుంబముగ నేలుచున్న గుణరత్నాకరులు మోహనాంగీదేవియు ప్రాచేతసుఁడును మనకు గురుస్వరూపులు, పితృసమానులు. వారే యవస్థలో నున్నను, వారి ననుసరించి సేవించుటయే మన

కృత్యమగును. నీ స్వప్నము, మంచి భక్తివిశ్వాసములను బ్రకటించు చున్నదే కాని, మఱి దేనిని గాదు.

వ్యాఘ్రపాదుఁడు — అటయిన, నీ మంత్రమున మన ప్రచేతసుఁడు మహారాజయ్యెనని యే యనుగ్రహింపఁ బడియున్నది.

కోలాహలుఁడు — సందేహ మేటికి? నినుబోఁటివారలు సేనానాయకు లుండ, పని కొఱఁత?

ఉ. కాంతచిరత్నరత్నమయకాంచనపీఠ మలంకరించి, సా
మంతులు మంత్రులున్ బ్రజలు మానితరీతి భజింపఁ, గీర్తి నీ
మంతిని నాట్య మాడ, మణిమండితదివ్యకిరీటధారి యై,
యెంతయు రాజ్య మేలు నతఁ డింద్రుఁడు గా స్వర్గము నేలు తైవడిన్!

వ్యాఘ్రపాదుఁడు — సంతోషించుచు వచ్చిన నన్ను సంతసింపఁ జేసితివి, నీ మహిమ మే మని కొనియాడుదును!

కోలాహలుఁడు — దేనికిని, దేవీదర్శన మమోఘఫల ప్రదాయకము; సేవించుకొని రమ్ము. నేనును నా రాకకై నిరీక్షించుచుండు మహారాజును సందర్శించి వచ్చెద.

వ్యాఘ్రపాదుఁడు — శుభ మస్తు! పోయి రమ్ము.

[ ఉభయులు చెఱి యొక వంకను నిష్క్రమింతురు. ]

ఇది శుద్ధవిష్కంభము

(ద్వితీయరంగము : అరణ్యమార్గమందలి మఱొక ప్రదేశము)

ప్రాచేతసుఁడు—(ప్రవేశించుచు) ఎంత యవరోధ, మెంత యవరోధము! తుద కామోహనాంగిని త్రోసి తప్పించుకొని వచ్చునప్పటికి కృత్యాద్యవస్థ యైనది. పరమేశ్వరా! నా బ్రతు కిప్పటికి బైటఁబడినది! నా కులమును కూలఁద్రోసికొంటిని! నా మతమును మంటఁగలుపుకొంటిని!

తే. ఇంచు చూడ్కుల నేకాగ్రదృష్టి నిలిపి,
రత్నహారంబు పుణుకుచు, రమణి నామ
మును స్మరించుటె జపము గా మనితి; నకట!
దుష్టచేష్టల బ్రతు కెల్ల భ్రష్ట మయ్యె!

నా పూర్వస్థితి తలపోసికొనుకొలంది నా ప్రాణములు తుక తుక యుడుకుచున్నవి. ఆ నాఁడు — నే నధోగతి కడుగు వైచిన నాఁడు — నిత్యసంతోషి యైన నా జనకుఁడు నావంటి కుపుత్రునిఁ గంటి నని యెంత చింతించెనో! తన దర్శనము నిమిత్తము విచ్చేయుచుండిన వసిష్ఠాదిమహర్షుల యెదుట, బ్రతికి యున్నంత కాల మెంత తలవంపులు గాంచెనో! కటకటా! కన్నతండ్రి గౌరవ మైన పాటింపనైతినే! (ఇంచుక యోజించి, తటాలున పూర్వస్మృతి నభినయించి) ఏమి, కన్నతండ్రి గౌరవమా? అహో! ఎంత నోఁచినవారి కంత యనుభవము కలుగకుండునా? నింబబీజము నాటి, రసాలఫల మాసించిన లభించునా? మఱి, యా చమత్కారిణి దుశ్చరితమున కేల నే నట్లు మండిపడవలయును? అది నా చేసిన యకార్యమునే చేసి చూపి నాకు బుద్ధి చెప్పినది. నాఁడు నా తండ్రి నన్ను

వెదకికొనుచు వచ్చి కిరాతకుటీరమం దడుగ, నే నట మోహా నాంగీబాహుబందీకృతుండ నై యుండియు లేఁ డనిపింపలేదా? పాప, మా వృద్ధుఁడు రాత్రి యనక ఘోరమృగములఁ బాటింపక దారి విషకంటకోపలవిషమం బని యైనఁ దలంపక యంత దూరము వచ్చి, నాయునికి నెఱింగియు నూరక మరలి పోవలసి వచ్చె నని యెంత సంతాపించెనో కదా? హా! తండ్రీ! ఎంతటి కృతఘ్నుఁడను!

ఉ. బాల్యమునందె తల్లి నెడఁబాసిన బిడ్డని న న్నఖండవా
త్సల్యము మీఱఁ బెంచితివి, తల్లిని మించి సమస్తరీతులన్;
తుల్యకృపాతిరేకతను దుశ్చరితంబు మదీయ మాత్మహృ
చ్ఛల్యము సైఁచికొంటివి; కృతఘ్నుఁడ, నీ ఋణ మెట్లు తీర్తునో?

హా! కారుణికోత్తమా!

చ. కొడుకుగఁ బుట్టియున్, తుదను గ్రుక్కెఁడు నీళులు గొంతులోపలన్
విడువఁగ నోఁచుకోనయితి; వేమఱు నన్ దలపోసి, ప్రాణముల్
వెడలెడు వేళ నెంతగఁ దపించితివో? యనుమాన మయ్యె, నా
వెడఁగుఁదనంబె నీ మృతిని వేగిర పెట్టెనె? తండ్రి, చెప్పుమా!

(నేపథ్యమువంకఁ జూచి, యులికిపడి) ఏ మిది, నా జనకుని ప్రేతమువలె పొడకట్టుచున్నది! (నిదానించి చూచి) తండ్రీ! నీ వీ దురవస్థయం దేల యున్నాఁడవు? నీ జపతపంబు లేమయ్యె? నీ శమదమాదిసద్గుణసంపత్తి కిదా పారలౌకికసత్కారము? ఏ స్వర్గంబుననో దివ్యదుకూలధారి వై నందనవనమందార లతాంతములతో చిఱునవ్వులు నవ్వుచుందు వనుకొంటినే! బాష్పజలపంకిల మైన యీ చీఁకటివన్నె చీలికలచీర నీ కెవరు

విధించిరి? అయ్యో! నెమ్మోమున కీ విన్నఁదన మేల కలిగె? నయనకోణము లేల సెలయేళ్లఁ గ్రుమ్మరించుచున్నవి? కించిదున్ముఖములై యుండెడి నీ యార్ద్రవనిశాతవీక్షణములు భూమిలోనికి గ్రుచ్చుకొనిపోయినట్లు పైకి లేవకున్న వేల? (వినుట నభినయించి) ఏమి, కుపుత్రునిఁ గన్న ఫలమా? అహో! ఎంత నిర్భాగ్యుఁడను! కులభ్రష్టుఁడ నగుటంజేసి, నీ ప్రేతత్వవిముక్తికై యుత్తరక్రియలు సైతము నిర్వర్తింపనేరనైతినే! కటకటా! నీ కిహపరంబుల రెంటను యాతనలే కూర్చిన మహాపాతకుఁడను, నే బ్రతికియుండి యేమి ప్రయోజనము? (అనుచు, చేతులతో మోము గప్పుకొని) అయ్యో! తండ్రీ! ఈ పాపాత్ముఁడు నీ ముఖము చూచుట కెంతయు సిగ్గుపడుచున్నాఁడు. క్షమింపు మని వేఁడుటకు సైతము నోరాడ * * * (అనుచు చేతులు మోడ్చి, తండ్రి కనఁబడిన వైపు చూచి, యతనిం గానక యాశ్చర్యపడుచు) ఏఁడీ? నా జనకుఁ డెక్కడ? చిత్రముగ నున్నదే! ఇది సత్యమా, చిత్తవిభ్రమమా? * * * ఇట్లయి యుండనోపు.

చ. కులమును గోలుపోయిన, నకుంరగతిన్ ద్విజకోటి సన్నిధిన్
సలిపితి శ్రద్ధమై దహనసంస్కృతి చిత్తచితన్ శుగగ్నితో;
తలకొను సంతతాశ్రుకణధారలఁ దర్పణ మాచరించితిన్;
చెలఁగె విలాపమంత్రములు; చేకుఱియుండును తండ్రి సద్గతుల్!

(ఆలోచించుట నభినయించి) చింతావివశుండనై యెంత పొరపడితిని! జీవన్ముక్తుఁడై బ్రహ్మచే వరంబులు వడసిన నా తండ్రికా ప్రేతత్వము! నాచేయు నుత్తరక్రియలా యతనిని

స్వర్గముం జేర్చునవి? ఆ పావనమూర్తి నామసంస్మరణమే నావంటి పతితుల నెందఱి నైన సముద్ధరించుటకు సమర్థ మై యున్నది! అప్రమత్తుఁడ నై యతని జీవిత మాదర్శముగ గ్రహించి నా యుత్తరజీవితమును సంస్కరించుకొనుటయే కర్తవ్యము. పితౄణవిముక్తి కిదియే మార్గము! ఇంకీ విమోహకోలాహలవిదూరుండ నగుటకు దారి యన్వేషింప వలయు. (అని యాలోచించుచుండును.)

కోలాహలుఁడు — (ప్రవేశించుచు, ఆశ్చర్యముతో చూచి, స్వగతముగా) వ్యాఘ్రపాదుని స్వప్నము ఫలించు చున్నదా యేమి? (ప్రకాశముగా) జయము జయము, మహా రాజునకు!

ప్రాచేతసుఁడు — (నిర్వేద మభినయించుచు, స్వగత ముగా) ఇస్సీ! ఈ పాడు మాట యెంత దుస్సహముగ నున్నది! మహారాజనా! నాకంటె నధమాధముఁడు గలఁడా? ఆ దురాశ లన్నియు వదలిపోయినవి కాని, కర్మశేష మింకను వదలినట్లు లేదు. (అనుచు, తల వంచుకొనును.)

కోలాహలుఁడు — (ఆశ్చర్యపడుచు, స్వగతముగా) ఇతఁ డేల యిట్లున్నాఁడు? ఆ యుత్సాహప్రవాహ మేల యింకిపోయినది? ఆ ప్రతాపజ్వాల లేల చల్లాఱిపోయినవి? ఘాతుకునివంటి ప్రాచేతసుఁ డింతలో నిట్లు మాఱుట కేమి కారణము? (ప్రకాశముగా) ప్రభూ! నేను కోలాహలుఁడను.

ప్రాచేతసుఁడు — (తల యెత్తి చూచి) ఔను, నీ వెప్పుడును సార్థకనాముఁడవే!

కోలాహలుఁడు—(స్వగతముగ) ఇతని ధోరణి వేఱు విధముగ నున్నదే! (ప్రకాశముగ) అదేమ ట్లనుచున్నారు?

ప్రాచేతసుఁడు—ఏమియు లేదు, ఇంకను నీ వేమి చెప్పి కష్టపెట్టెదవో యని.

కోలాహలుఁడు—కష్ట మెప్పుడో కడచిపోయినది. అతిసులభముగ సామంతులలో నంతఃకలహము లు కల్పించితిని. వా రన్యోన్య మాగర్భశత్రువులవలె పోరాడి బలహీను లగుచున్నారు. మన సైన్యము లన్నియు సన్నద్ధము లై యున్నవి. విజయలక్ష్మియు రాజ్యలక్ష్మియు మీ యాజ్ఞను నిరీక్షించుచున్నారు.

ప్రాచేతసుఁడు—(విరక్తితో) కోలాహలా! నిజము చెప్పుచున్నాఁడను; నన్నా దురాశ లన్నియు నెన్నఁడో వదలి పోయినవి. న న్నేమియు నడుగవలదు; నా కేమియు చెప్ప వలదు. ఇంతదనుక నీ చేసిన మహోపకారముల కెంతయు కృతజ్ఞుఁడను.

కోలాహలుఁడు—స్వామీ! ఈ యాకస్మికమనస్తాపమునకు హేతు వెవరు? ఈ దాసుఁడు వారి ప్రాణము లైనఁ దెచ్చి మీ కర్పింప సంసిద్ధుఁడు.

ప్రాచేతసుఁడు—కోలాహలా! నీ భక్తిశక్తులు నే నెఱుంగనివా? పురాకృతపుణ్యలేశవశముచే, అట్టి పను లసహ్యము లైపోయినవి! నా పూర్వాశ్రమస్మృతియే న న్నా పాపస్వప్నమునుండి మేలుకొలిపి, హింసాశయ్యనుండి లేవఁదీసి

నది. బాధాకరము లైన నీ పలుకులు మొలఁకువలోని కలవ రింతలవలెఁ దోఁచుచున్నవి. నా బాధ యితరులు గ్రహించి జాలిపడుటకు సైతము వీలు కానిది. (దుఃఖించుచు) ఇంత వఱకసంతజీవరాసుల నవలీలగ నకరుణముగ వధించి వైచితినే, ఎన్నెన్ని జన్మముల కైనఁ జాలవా యీ పాపములు? ఇంకను పాపసంచయ మేల గావించుకొనవలయును?

శా. మాంసాహారవిసర్జనవ్రతము సంభావించియుసు, బ్రాణివి
ధ్వంసప్రక్రియ కియ్యకొంటి బలులస్ బాపస్పృహాశూన్యతన్;
సంసారార్థమె కాక, కేవలధనాశాభూతపెడాగ తిన్
హింసంబెట్టితి దొంగనై జగము; నింకే నొల్ల నా దుష్కృతుల్!

తే. దుష్టసంసారబంధంబు తొలఁగెఁ గాన,
పంజరవిముక్తవిహగంబు పగిది, నిపుడు
పూర్వవాసనాబలమునఁ బూని, యుపగ
తాత్మనీనద్విజకులాప్తి కాత్రపడెద!

కోలాహలుఁడు — ప్రభూ! సర్వము సంసిద్ధమై యాజ్ఞామాత్రమున ఫలింపనున్న యీ సమయమందు, స్వధర్మము పరిత్యజించుట యధర్మము గాదా?

ప్రాచేతసుఁడు — కాదు, కాదు! స్వధర్మ మనస్థాను సారము. జన్మమాత్రముచే నైన బ్రాహ్మణుఁడ నై యున్న నాకు, శమదమాదిసాత్త్వికకర్మములు స్వధర్మములే కాని, మారణశాసనాదిదారుణకర్మము లధర్మములు. అవివేకాతి శయంబున నొకప్పు డధోగతి పాలైనను, అంతరాత్మ యుప దేశంబు ననుసరించి బాగుపడఁ జూచుటయే మానవధర్మము.

కాలప్రవాహమునం బడి కొట్టికొనిపోవుట సామాన్యజన లక్షణము; దాని కెదురీఁది గట్టెక్కఁబూనుటయే విశిష్టజన లక్షణము. ఫలము దైవాధీన మైనను, ప్రయత్నలోపమునకు మానవుఁడు బాధ్యుఁడు. బ్రహ్మకర్మానుష్ఠానంబుచే నాపాతకము లెల్ల నశింపఁగల వని నా యంతరాత్మ యుపదేశించుచున్నది.

మ. స్థిరనిష్ఠాస్థితి సోమిదేవి, స్వతపస్తేజంబు హోమాగ్ని, దు
ర్భరపూర్వార్జితపాపముల్ పసువు, లా బ్రహ్మం బుపద్రష్ట, మ
త్వరితాపైకపునీతనీతమతి యధ్వర్యుండు; నే నియ్యెడన్
పరమార్థంబు ఫలంబు గా, మఘము సమ్యగ్దీక్షఁ గావించెదన్!

నన్నిఁక బాధింపకుము.

తే. పాపమునఁ దక్క, మామకప్రాభవంబు
నిఖిల మిదె నీ కొసంగెద; నిరుపమాన
రాజ్యవిభవంబు గనుము, బిరానఁ బొమ్ము;
హితమతిన్ నన్ను నా త్రోవ నేఁగనిమ్ము!

కోలాహలుఁడు — (స్వగతముగ) ఇతని హృదయ గహ్వరమున నిద్రించుచుండిన జ్ఞానపంచాననము పేరాఁకలితో మేల్కాంచిన ట్లున్నది. ఇఁక మేము దీని కెఱ గావలసినదే కాని, గత్యంతరము లేదు. (ప్రకాశముగా) ఆర్యవర్యా! మీ కక్కఱ లేని రాజ్యము నాకు మాత్ర మేమిటికి? మీ శిష్యుల మైన మాకు త్రోవ చూపి కదా మీ త్రోవను మీరు పోవలయు. శిష్యులఁ జెవిడుచుట గురుధర్మమా?

ప్రాచేతసుఁడు — (స్మృతి నభినయించి, తత్తఱపడుచు, స్వగతముగ) అయ్యయ్యో! అయ్యయ్యో! ఆ విజ్ఞాన

ప్రదుల నింకను పాశబంధములం దుంచితినే! ఎంత గురుద్రోహ, మెంత గురుద్రోహము! (అనుకొనుచు, తటాలున వెడలి పోవును.)

కోలాహలుఁడు — (తెచ్చవడి, తెలిసి) ప్రయత్న మంతయు వ్యర్థ మైపోయినది! భావనాహర్మ్యము లెల్ల భగ్నము లైపోయినవి! సంసిద్ధసామ్రాజ్యము క్షణములో నంతరించెనే! చేతికిఁ జిక్కినది సైతము వానిక దక్కనుటకు వలనుపడదు. (ఇంచుక యాలోచించి)

ఆ. పౌరుషం బదెంత బలవంత మైనను,
ఫలము గనదు దైవబలము లేక;
దైవబలము నమ్మి ధర్మంబు తప్పక
మెలఁగువాఁడె తుదకు మిగులువాఁడు!

ఆకస్మికముగ నీ ప్రాచేతసున కెంత వైరాగ్యము కుదిరినది! ఇంకితని దృఢసంకల్పమును మరల్చుట బ్రహ్మకైన నశక్యము! (ఇంచుక యోజించి) కాలవశముచే నెన్ని యవాంతరములు కలిగినను, ఎన్నఁటికైన జీవి యిట్టి పరిణామము పొందవలసిన వాఁడే! కావున, మతము మార్చుకొని యితని ననుసరించుట యే కర్తవ్యము. కాని, యున్నట్టుండి మే మిరువురము పరిత్యజించునెడల, ప్రజల గతి యే మగునో! అతని యాలు బిడ్డ లెంత యడలుచున్నవారో! సత్వరము పోయి కనుఁ గొనెదఁగాక! (అనుచు నిష్క్రమించును.)

శ్రీ రస్తు

# వాల్మీకి

## చతుర్థాంకము

(ప్రథమరంగము - అరణ్యమార్గము)

చమత్కారిణి—(దుఃఖముతో ప్రవేశించుచు) ఎంత వెఱ్ఱి తుత్తర పాలైపోతిని! పాలవంటి కుటుంబానికి పాడు పేరు తెచ్చానే! కని పెంచిన వాళ్ల కన్నూ కాడా కంట్లో నలుసునై పొయ్యానే! బ్రతుకే బరువుగా తోస్తూంది, ఇం కేం చేస్తును? (అని యాలోచించుచు నేల వంకఁ జూచి, యక్కడఁ బడియున్న తీఁగ నందుకొని) దిక్కు మాలిందా న్నని జాలిపడి, దేవుఁడే దీన్ని చూపించిన ట్టుంది; దీన్తో వురేసుకోవొచ్చు. (అని యురిపోసికొనుట నభినయించుచు) కుశాలుగాఁడు, తక్కువ్వాఁడైనా, యెక్కువ బుద్ధి చెప్పాఁడు. వాఁడి మాట వినుంటే, నా కీ కష్టం కలిగేవుండదు. మించి పోయాక చింతిస్తే యేం లాభం? ఈ పాపిష్టురాలి కీ శిక్ష కావలసిందే! (అని యేడ్చుచు, ఉరి బిగించుట నభినయించు చుండును.)

సుశీలవుఁడు—(ఆత్రముతో ప్రవేశించుచు) వొద్దొద్దు! వుండుండు! నువ్వాడ తీఁగ లాగతుంటే, నా కీడ

పీక బిగుస్తుండది. (అని తీఁగ తీసి పాఱవైచుచు) పావాల నంత సర్దాంగా వుంటె, యీ పాడు తీఁగతో పనేం? వొకళ్ల సేతుల్తో వొకళ్లం వుఁసుకుని, యిద్దఱం సద్దాం! (అనుచు, కంఠము కౌఁగిలించుకొనఁబోవును.)

చమత్కారిణి—(ఉలికిపడి తొలఁగి, తల వంచుకొని నిల్చును.)

కుశీలవుఁడు—(చమత్కారిణిని సాభినయముగ వెంబడించుచు) యిద్దో, యిద్దో! యిటు సూడు! నా న్కుశాలుగా ణ్ణొచ్చుండానే, యింకా నీ కీ దిగు లెందుకూ?

(నాదనామక్రియా రాగము; ఆది తాళము)

ప. నాదు పాణా లుండంగానే, - నీదు పాణా లెందూ పోనూ?
పాణమూలూ - వకటే గా మనకూ!
వో - ముద్దరాల! నా - ముద్దుగుమ్మా!
సావ సేలా? - సల్లం గుందామే! వో - ముద్దరాల!

2. యీడ వుంటే మరుఁడీశాతో, - యి త్తెల్చిన మీా వోళ్లశాతో,
నీవు నేనూ - సావకతీరాదే!
వో - వన్నెలాడి! నా - చిన్ని కన్నె!
పాఱిపోతే, - బతకావొచ్చానే; వో - వన్నెలాడి!

3. బెమ్మరుద్దుర్లాకూ తెల్పీ - బొమ్మశెముడూ డొంకా కద్దూ;
గెడియలో నిన్ - తోడకాపోతానే!
వో - కులుకులాడి! నా - కలికిమిన్నా!
బైమ దేలా? - బైలూదేరావే! వో - కులుకులాడి!

చమత్కారిణి — (కుశీలవుని బారినుండి తప్పించుకొనుచు) తాళ్తాళు! దూరంగా వుండి మాటాడు. అప్పు ణ్ణేను తప్పు దోవ తొక్కితే నన్ను మంచి దారికి మరల్చావే, ఇప్పు ణ్ణీకీ దుర్బు ద్ధెందుకు పుట్టిందీ? నీవు నా గ్గురువ్వంటివాఁడవు; ఆ గుర్లోనే వుండు. నిజంగా నీకు నామీఁ ద్ద యుంటే, నా యిష్ట మొచ్చినట్టు నన్ను చచ్చిపోనీ!

కుశీలవుఁడు —

(ఫీల్ రాగము; ఏక తాళము)

ప. యిది యేందే - యీ యిశిత్రమూ!
వో - యెట్టీ పిల్లా! యిది.

చ. నే 'నైఁ' యంటే, - నివు 'నైఁ' యింటవు;
నే 'నైఁ' యంటే, - నివు 'నైఁ' యంటవు! యిది.

2. తనంత నస్తే, - తప్పదు పాపం;
వూరికె పాపం - వొరిస్త నంటవు! యిది.

3. సుకమే పుణ్ణెం, - సుకమే మోచ్చం,
పెంట్లే సుకమే, - పెం ట్లో ద్దంటవు! యిది.

చమత్కారిణి — నేన్నిన్ను పెండ్లాడ్డం తప్పు; తెలిసో తెలియకో నీకు మనసూ మాటా యిచ్చాను గనక, ఇఖమీఁదింకోణ్ణి కట్టుకోడం కూడని పని. నాంతట చావడం పాప మన్న మాట నచ్చిందీ; నిజంగా నీవు నా గ్గురువ్వంటివాఁడవే! నీకు మొక్కుతాను, నా దారి న్నన్ను పోనిచ్చి, నీ దార్ని నీవు పో. ఎక్కడైనా పెండ్లాడి సౌఖ్యంగా వుండు!

కుశీలవుఁడు — (రోషముతో) అస్సల్ — అచ్చం — అప్పటం జాతో ణ్ణయితినే, నువు నన్ను పెళ్లాడ్డం తప్పా? యేం దీ కంతిరీ మాట! * * * వూరుకుంగ మంటే, వుండఁబట్ట లే. (నవ్వుచు) యెటూ యిల్లొది లొచ్చేస్తివే, ఇఖ నన్ను కట్టుకోడాని కడ్డ మేంటి?

చమత్కారిణి — (తీవ్రముగా) వోరీ! మంచిగా చెప్పే కొద్దీ, మించిపో తున్నావు. నీచపు నౌఖరువు, నీ వెంత? నీ తాహా తెంత? నోటికి బుద్ధి చెప్పుకుని బతుకు. పో, నా యెదట నిల వొద్దు!

కుశీలవుఁడు — యేం దీ పిచ్చి బెదిరింపు! మొద ల్నన్నీ దోవ పట్టించి, యిఫు డిశిశి పెడత నంటవా? ని న్నేం శేయిస్తనో సూడు నా దెబ్బ! (స్వగతముగా) యి దే నన్నట్ట కీడుస్తుండ దని యెగుర్లాడ తా; కామం దిదివర్లో దీన్నంగ తూ శుండాఁడు గనక, యిది గాబరాపడి కాళ్ల బేరాని కొస్తది. యిదీ నా దెబ్బ! (అని, నేపథ్యము వంకను చమత్కారిణి వంకను మార్చి మార్చి చూచుచు, వికటనాట్యముతో ప్రకాశముగా)

(శంకరాభరణము రాగము; ఆది తాళము)

చ. యిదుగో సూడు! - యి టొచ్చి సూడు!
యీ శెమత్కారిని - యి దేందొ సూడు!
దయ్యం లాగా - మళ్లీ పట్టీ,
దణ్ణ మెట్టినా - వొదిలే య్నంటది!

ప. యేమి శేస్తునురా? - గురుఁడా! - యెలాగ బతుకుదురా?

చమత్కారిణి — (ఆశ్చర్యపడుచు, సక్రోధముగా) ఓరి పాపాత్ముఁడా! ఎంతకు తెగించావు! నా కడుపుమంట నీకు తగలకపోదు; ఇపుడు గాకుంటే యింకోప్పుడైనా, నా తండ్రి నీ తప్పు కనుక్కొని నీకు తగిన శాస్తి చేస్తాఁడు పో!

కుశీలవుఁడు — యేం దీ పిట్ట శాపం! (నేపథ్యము వంక చూచి, భయావేగమున త్రోసగఁక త్రొక్కులాడుచు) సస్తిన్రా గురుఁడా! ఆఁడుగో, ఆఁడుగో! కామం దాఁడుగో! పసి పట్టి న్సింగం లాగ పరిగెత్తు కొస్తుండఁడు! వో లమ్మో! వాయి బాబో! (అనుచు, తొరత్రొక్కులాడుచుండును.)

ప్రాచేతసుఁడు — (ప్రవేశించి, చమత్కారిణీకుశీలవుల గుర్తింపకయే, గురుబంధవిమోచనోత్కంఠుఁడై) ఎంత గురుద్రోహ, మెంత గురుద్రోహము! (అనుచు, రంగమున కడ్డముగా పరుగెత్తికొని పోవును.)

కుశీలవుఁడు — (తొరత్రొక్కులాడుచు) నా నేం శెయలేదు, సామే! నాఁ నేం శెయలేదు. అంతా * * * అంతా * * * (అని చమత్కారిణిని చూపుచు, బీభత్సముగా పాఱిపోవును.)

చమత్కారిణి — (దుఃఖించుచు) అయ్యో! అయ్యో! ఎంత గురుద్రోహం చేస్తిని, ఎంత గురుద్రోహం చేస్తిని! పై మీఁద బట్టయినా లేకుండా పరుగెత్తు తున్నాఁడే! అయ్యో!

తండ్రీ! నా పాపిష్టి చేష్టే నీకీ గంగవెఱ్ఱి తెచ్చిపెట్టిందా? అప్పు డెత్తిన కత్తితో చేతులారా నీవే నన్ను చంపేసుంటే, నీ కష్టం నా కష్టం కూడా తీరిపోయుండునే? ఇప్పుడేం చేస్తాను? ఈ పాడు ముఖం నీకు చూపలేను, ఈ పాడు ముఖంతో నిన్ను చూడలేను. ఏ పులి వాతనో యే వ్యాఘ్రాజము క్రేబనో పడి కడ తేరడమే నా గ్గతి! (అనుచు నిష్క్రమించును.)

ఇది ప్రవేశకము

---

(ద్వితీయరంగము : కాళికాలయాంగణము)

ప్రాచేతసుఁడు — సోత్కంఠముగ (ప్రవేశించుచు)

ఉ. మీ రెవరో మహాత్ములు, క్షమింపుఁడు; నన్ను సముద్ధరింప నే
తేర, నఘాతిరేకమునఁ దెల్వి సమస్తముఁ గోలుపోయి, యీ
వ్వారిగ మిమ్ము దూఱి యరుబద్ధులఁ జేసితి, సన్నిపాతదు
ర్వారత స్వాస్థ్య మీఁగడఁగు వైద్యునిఁ దిట్టెడి రోగి కైవడిన్.

(అనుకొనుచు, త్రాళ్లు కట్టియున్న యుత్త చెట్టుకు సాష్టాంగ నమస్కారము చేసి లేచి, నలు కెలంకులు కలయఁజూచి వెల్లఁబోయి) ఏరీ? ఏమైరీ మహానుభావులు? (చెట్టు పరికించి) కట్టిన కట్లు కట్టినట్టియున్నవే, యున్నట్టుండి యెట్లు తప్పించుకొని పోయిరి? *** వా రెవరో, అమానుషశక్తిసంపన్నులు! కావుననే, వారి దివ్యసందర్శనము నన్ను దుష్టసం

సారదూరునిఁ జేసివైచినది! మందబుద్ధినై యెంతటి మహాప చారములు గావించితిని! నోటికి వచ్చిన కల్ల కాఱులు ప్రే లినను, తుదకు పైఁబడి నఱకఁ బోయినను, వారి వదనమండల ముల ప్రసన్నత యించుకేనియు తఱుగలేదు. ఇది కాదు విశే షము, నాచేఁ దాము పాశబద్ధులగునప్పుడు సైతము, నన్నఘ బంధవిముక్తునిఁ గావించుటకే వారు ప్రయత్నించిరి! సందియ మేటికి? మహానుభావుల కరుణావిశేష మిట్టిదే!

ఆ. కోసి గ్రుచ్చి కట్టు కుటిలచిత్తునకైన
పరిమళంబు గూర్చు విరులు వోలె,
ఎగ్గొనర్చువాని కేనియు నుపకార
మాచరించు చుందు రనఘమతులు!

వారు నిశ్చయముగ నా జనకుని మిత్రులే, కనుకనే పుత్ర వాత్సల్యము వహించి నన్నుద్ధరింప విచ్చేసిరి. నాకిపుడు వారే పితృసమానులు, గురుస్వరూపులు. *** వారిని సైతము తూలనాడి తొలఁగఁ ద్రోసికొన్న ద్రోహినే, నాకిం కేమి తర ణోపాయము? నా జీవితమం, దదేమో కాని, మఱచి యైన నొక్క మంచి పని కూడఁ జేసినవాఁడఁ గాను.

మ. అకలంకం బగు భార్గవాన్వయము దూష్యం బయ్యె నన్ గాం చుటన్;
సకలారాధ్యము విద్య దుష్ప్రథ గనన్ సం దయ్యె నన్ గాంచుటన్;
ప్రకటాత్మీయసమస్తశక్తులును జీవచ్ఛోభకే పాల్పడెన్;
స్వకృతాఘౌఘభరంబు గుస్సహము, నా ప్రాణంబు లల్లాడెడిన్!

ప్రాణములారా! పరితపింపకుఁడు. అజస్రం బఖిలోపచారము లాచరించుచు, అనోన్యభావస్థితి ననువర్తించెడి యంగంబు

పై పైతము మీా కింత రోఁత పుట్టించిన యీా మహాపాతకుఁడు పశ్చాత్తాపపావకజ్వాలలం బడినవాఁడు; అచిరకాలంబుననే భస్మీభూతుఁడు కాఁగలఁడు. మీారు విముక్తులరయ్యెద, రింక మెచ్చుకొనుఁడు. *** అయ్యయ్యో! ఏటి కీ తత్తఱపాటు? నిమేష మేనియు నిలువనేరరా? *** కటకటా! ఇవి బలాన్నిష్క్రమణమునకై తొందరత్రొక్కులాడుచున్నవి; దారి గానక తపించుచున్నవి. ఏమి చేయుదును? (సాభినయముగ)

ఉ. గుండియ వ్రచ్చితో, నయనగోళములన్ వెకలించితో, మహో
ద్దండత బ్రహ్మరంధ్రము విదారణ సేసియొ దారి చూపెదన్;
పొం, డిఁక నేల తల్లడిలి పొక్కఁగఁ? బ్రాణములార! పాపముల్
నిండెను; బందెవేయఁ దగునే మిము మిన్న కహోబలంబునన్?

(అనుచు నిలువునఁ గూలఁబడి, మెల్లఁగ లేచి బాధ నభినయించుచు) ప్రాణములారా! మీా రెల్ల రొక్కసారి యేల పోరు? ఒక్కొకరుగ మెలమెల్లఁగ నుత్క్రమింప నుపక్రమించి తీఱని మారణయాతన లేల కూర్చెదరు? ఆయువుప ట్టదరిపోవుచున్నవే! జీవనాడు లెల్ల భిన్నభిన్నములై చెల్లచెద రగుచున్నవే! ఎంత దుర్భరము! చెయి నైచి కలియఁబెట్టినట్లున్న దీ కడుపులోని యారాటము! (తూలి తూలి పడఁబోవుచు) కనులు దిర్దిరం దిరుగుచున్నవి! తల గిఱ్ఱుగిఱ్ఱున చుట్టుచున్నది! *** నా శరీరమా తనంత కంపించి యిట్లు పడఁబోవుచున్నది? కాదు, కాదు! ధరణీచక్రమే యీా పాపాత్ముని భరింపలేక, తల్లడిల్లి తడఁబడి పరిభ్రమించి, పడఁ

ద్రోయుచున్నది! అంతరంగమా! త్రోసి త్రోసి చూప నేమిటికి? (ఎవరినో చూచుట నభినయించుచు) వాఁడుగో! వాఁడుగో! నా కటకటమ్ము ఱొమ్మున నాటి నోట నెత్తురు గ్రక్కుచు గిజగిజ తన్నుకొనుచున్నాఁడు, పాప! మా పాంథుఁ డెవఁడో? (వే ఱొక వైపు చూచుచు) అయ్యయ్యో! సతీ తిలకమా! నీ వేల యడ్డువచ్చితి వమ్మా నీ మగనిఁ గాపాడు టకు! ఈ ప్రాచేతసహతకుని కరవాలము క్రౌర్యమునకు క్రౌర్యము కలదు నని యెఱుంగవా? కంఠము సగము తెగి పోయెనే, ఏమి చేయుదును? (మఱియొక వైపు చూచుచు) ఏమి యీ యఘోరదర్శనము! ఎన్ని శవము, లెన్ని శవ ములు! ఎన్ని రుండములు! ఎన్ని మొండెములు! ఎంత చిత్రవధ! (ఇంకొక వైపు చూచుచు) వీ రంద ఱెవరు? వికలాంగు లై విలపించుచున్నారే! (కనులు మూసికొని) ఎంత మందిని హింసించితిని! ఎంత ధన మపహరించితిని! (గుండె బాఁదుకొనుచు) ఎంత పాపమున కొడిగట్టితిని! ఎంత పాపమున కొడిగట్టితిని! (గుండె నదిమి పట్టుకొని) గుండె గుభిల్లు మనుచున్నది! (కను లొత్తుకొనుచు) కనుల మసకలు క్రమ్ముచున్నవి! (దిక్కులు చూచుచు) ఈ సువిశాలశూన్యప్రదేశమధ్యమున నిరాధారముగ నిల్చి యున్నాఁడనే! (తల యెత్తి చూచుచు చే యొడ్డి) అయ్యయ్యో! ఎట్లు తప్పించుకొందును? ఆకాశమా! ఏల విఱిగి నాపైఁ బడుచున్నదానవు? (నిదానించి చూచి) ఘనసంఘాత మా యేమి? * * * కాదు కాదు, ఘనీభవించిన ఘనాఘ

సంఘాతము! (తెల్లఁబోయి, యొడలు తడవి చూచుకొనుచు) ఇది భౌతికశరీరమా, యాతనాశరీరమా? (దిక్కులు చూచుచు) ఇది భూలోకమా, యమలోకమా? (క్రుంగుచు) నన్నణఁగఁ ద్రొక్కుచున్నది మూర్తీభవించిన పాపపుంజమా, యమభటసందోహమా? (బాధ నభినయించుచు) ఈ యనిర్వాచ్యయాతన లెట్లు సహింతును! (త్రుళ్లిపడి) యమదూతలు! యమదూతలు! (తప్పించుకొనుటకై త్రొక్కులాడుచు) హృదయవిదారకంబు లగు వీరి బల్లెపుఁబోట్లు నే నెట్లోర్తును! అయ్యలారా! దయచేసి నన్నొక్క పెట్టునఁ జంపివేయుఁడు; కండ కండను ఖండించి, నరము నరమును నఱంచి, యెమ్మెమ్ము నుచ్చాలించి, యీ దురంతసంతాపమును దుస్సహావేల గావించెదరు? (భయావేగముతో) ఆ ధవళతప్తమూష యేమిటికి? లోహము ద్రవీభవించి తుకతుకలాడుచున్నదే! నన్ను విడుఁడు, నన్ను విడుఁడు! తీవ్రోష్మమరీచిపరంపరలు సూచీముఖంబుల వలె నా గ్రుడ్లను గ్రుచ్చుచున్నవి! అయ్యయ్యో! ఆబ లణఁగి పోయెనే! ఇఁక నన్ను విడుఁడు! ఒడలు మాఁడిపోవుచున్నది; మాంస ముడికిపోవుచున్నది! (వెనుక కీడ్చుకొనుటను బలాత్కారముగ ముం దడుగువేయుటను నటించుచు) అయ్యలారా! అయ్యలారా! ఇంకను నన్నా మూసవైపే లాగికొని పోవుచున్నారేల? అంత కంత కతిశయించి, సన్నావరించుచున్న యీ తీండ్ర మగు వేండ్ర మెట్లు సైఁతును! ఆచరించిన యఘము లత్యుత్కటము లైనను, నా ముంజేయి యీ కరఁగిన యినుములో ముంపఁదగిన దేనా? అబ్బబ్బా! నా చెయి తీయ

నిండు; కాలుచున్నది, మండుచున్నది! హా! హా! హా! (అనుచు మూర్ఛపోయి, త్రుళ్లిపడి చే యెత్తి యాడించుచు కలలో కలవరించునట్లు) అయ్యయ్యో! అయ్యయ్యో! చేయను చేయ, నిఁక జీవహింస చేయను! * * * (దొరలుచు) దొరలింపకుఁడు, దొరలింపకుఁడు! అసిధారాతల్పంబునం బడఁద్రోసి దొరలించెద రేటికి? అబ్బబ్బా! అబ్బబ్బా! కాయమంతయు నొకటే గాయమై నా నెత్తురు నా వాతఁ గొట్టుచున్న దే! (మ్రొక్కుచు) బుద్ధి బుద్ధి! బుద్ధి బుద్ధి! త్యజించితినే, తస్కరవృత్తిని నేనే త్యజించితినే! (గడగడ వడఁకుచు) తీఁగ తీసిన యగ్నిహోత్రములవలె నున్నవి కాలిన యీ ఖనిత్రములు! (ముడుఁచుకొని తప్పించుకొనుచు) అబ్బా! అబ్బా! పొడువకుఁడు, పొడువకుఁడు! ఇఁక గురుద్రోహము చేయను, గురుద్రోహము చేయను! హా! హా! హా! (అనుచు, నిశ్చేష్టుఁడగును.)

[ వసిష్ఠవిశ్వామిత్రులు ప్రవేశించెదరు. ]

వసిష్ఠుఁడు—(హృష్టుఁడై ప్రవేశించుచు, విశ్వామిత్రు నుద్దేశించి) మిత్రమా! ఇటు దూరమునుండి పరికించి చూడుము, ప్రభాపరివేషమధ్యంబున చంద్రబింబమువలె ప్రకాశించుచున్న దితని వదనమండలము!

మ. పుటపాకమ్మున స్వచ్ఛమై మెఱయు మేల్బొంబొమ్మ చందమ్మునన్
స్ఫుటగాత్రం బనుతాపపాకమునఁ దేజోదీప్తమై యొప్పఁగా,
కటుపాపంబుల కెల్లఁ దీవ్రమగు శిక్షల్ స్వప్నకాలంబునన్
ఘటనం బొటఁ బవిత్రుఁడై, యితఁడు సంస్కారార్హతన్ గ్రాలెడిన్!

విశ్వామిత్రుఁడు — (ఆలోచన మభినయించుచు) ఆర్యా! ఏ మిట్లనుచున్నాఁడవు? ఈ కల్ల శిక్షయే శిక్ష యగు నెడల, పాపమునకు భయపడనలసిన పనియే యుండ దేమో?

వసిష్ఠుఁడు — విశ్వామిత్రా! నీ యభిప్రాయ మేమి? శిక్ష యన, ప్రతికృతియో పగ దీర్చుకొనుటయో యనుకొను చున్న ట్లున్నది. శిక్షాస్వరూపము వ్యక్తిపరిపాకము ననుసరించి నిర్ణీత మగుచుండును. పాపిని పశ్చాత్తప్తునిఁ గావించి, సన్మార్గో న్ముఖునిఁగ సంస్కరించుటయే శిక్షాప్రయోజనము! కలలోని శిక్ష కల్ల శిక్ష యనుకొనుచున్నాఁడవు కాఁబోలు, ఏ యవస్థ లోని శిక్ష కైనను ఫలము మానసికానుభూతియే కదా? ఈ సందర్భమం ద దేమి కొఱవడెను? ఇట్టి పాపుల కిదియే సరి యైన శిక్ష.

ఉ. వ్యగ్రకఠోరశిక్ష లివామం దనుభావ్యము లైనచో, నెటుల్
జాగ్రదవస్థయం దవి యసంభవముల్; మఱి స్వప్నమందుఁ దా
ముగ్రగతిన్ ఘటిల్లి స్మృతియోగ్యము లౌటను శిక్షితాళిఁ బ్ర
త్యగ్రులఁ జేయు, నారకములట్టులు గా, కటు భావిజీవికన్!

విశ్వామిత్రుఁడు — నీ సమర్థన మెంతయు సమంజస ముగఁ దోఁచుచున్నది.

ప్రాచేతసుఁడు — (ఇంచుక చలించును.)

వసిష్ఠుఁడు — ప్రాచేతసుఁడు మేలుకొనఁబోవుచున్న ట్లున్నది. ఇతనికి మంత్రోపదేశము చేసి మనము పోవుదము.

(అనుచు, ప్రాచేతసుని చెవిలో తారకమంత్ర ముపదేశించు చుండును.)

విశ్వామిత్రుఁడు — (శ్రవణ మభినయించి, నేపథ్యము వంకఁ జూచుచు) మిత్రమా! చూచితే, యీ మోహనాంగి పతిభక్తి! వియోగవేదనాదోధూయమాన యై ప్రియాన్వేషణం బొనర్చుచు, ఈ వైపే యేతెంచుచున్నది.

వసిష్ఠుఁడు — (దిగ్గున లేచి, అనుతాపముతో) ప్రాచేతసు నుద్ధరింపఁబూని, ప్రత్యక్షముగ నీమె కపకారము గావించితిమి.

విశ్వామిత్రుఁడు — ఈ విషమవిధాన మనుల్లంఘనీయము!

క. ఒక జీవి కెది సుఖంబో
ప్రకటంబుగ నదియె దుఃఖభాజన మగు వే
ఱొక జీవి; కీ నిరంతర
వికటవిధిన్ గనిన, బ్రతుకె విషముగఁ దోఁచున్!

వసిష్ఠుఁడు — ఈ మీమాంస య టుండనిమ్ము. ఈమె కిపు డుపకరించుట మన కవశ్యధర్మము; ఇదె వచ్చుచున్నది, యేమి చేయునో యీ చాటున నుండి చూతము రమ్ము. (అని, పొంచుండును.)

విశ్వామిత్రుఁడు — (వసిష్ఠు ననుగమించును.)

మోహనాంగి — (ప్రాచేతసునిఁ జూడక యే, కాళిపై దృష్టి నిలిపి చేతులు మోడ్చి, విషాదముతో ప్రవేశించుచు)

ఉ. కొట్టెను దండ్రి యన్ కినుకఁ గూఁతురు వోయె; న దేమి యయ్యెనో?
యిట్టె విరక్తుఁ డై యెటకొ యేఁగెడి నాథుఁడు, చేతఁ జిక్కి నా
పట్టున నిల్చియున్, తుదకుఁ బర్విడె న న్నటు త్రోసి; యక్కటా!
యెట్టు సహింతు నీ యతిశయించిన దుఃఖము? కాళికేశ్వరీ!

తే. దేవి! నీ భర్తృరాండ్రకు నీవు గూర్చు
శుభము లిట్టివె? యేటి కీ శోధనంబు?
సతివి, సతులపాలిటి కల్పలతవు! నీవు
మ్రొక్కెదను, నా దిగులు దీర్చి ప్రోవుమమ్మ!

(అని, సాష్టాంగనమస్కారము చేసి లేచుచు) హా, జగజ్జననీ! ఎం దని వెదకుదును? ఎక్కడి కని పోవుదును? ఎంత దిక్కు మాలినదాన నైతిని! (అనుచు, నలు కెలంకులు కలయఁ జూచి, ప్రాచేతసుని గుర్తించి, ఉద్రిక్తోత్సాహముతో) ఇక్కడ నే యున్నాఁడే, ఏమి నా భాగ్యము! (అనుచు, పాదముల పైఁ బడి లేచుచు, నిదానించి చూచి) ఇతఁ డేల యీ విధముగా పడియున్నాఁడు? (అనుచు, ముక్కును గుండెయు తాఁకి పరీక్షించి) హా! నాథా! (అనుచు మూర్ఛిల్లి, యించుక తెలిసి, లేచి కూర్చుండి) అయ్యయ్యో! నా ప్రాణము లింకను పోవకున్నవే, నే నెంతటి పాపిష్ఠురాలను! నా హృదయ మింకను వ్రయ్యకున్నదే, నే నేమి చేయుదును! నాథా! నాథా! నీ వియోగమే భరింపఁజాలకున్న నేను నీ మరణార్తి నెట్లోర్తును? కటకటా! కడుపు చెడఁబుట్టిన యీ పాడు బిడ్డ కై ని న్నెంతటి మా టంటిని! ఈ పాపపక్షపాతిని లోకమే పనికిరా దనుకొంటివా యేమి! మందమతి నగుటం

జేసి నీ గంభీరాశయము తెలియంగలేక నీ యాగ్రహంబునకు గుఱి నై వెనుకఁబడితినే కాని, ని న్నెడఁబాసి నిమిష మైన నుండనేర. (అనుచు లేచి, ఆకసమువంకఁ జూచుచు) ఇదె, వచ్చుచున్నదాన; ఇంచుక తాళుము! నీ ప్రభావప్రదర్శన మున కీ ప్రపంచ మర్ష్యరంగము గాదని యెంచేఁగితివి? (అని, మొలలోని బాఁకు తీసికొనుచు)

మ. పరమస్వర్గము కొల్లగొట్టఁ జనితో? వైరాగ్యసైన్యంబుతో
 నరివర్గంబు జయించి శాంతమతి వై యా మోక్షసామ్రాజ్యమున్
 బరిపాలింపఁగ నేఁగితో? తెలుపుమా ప్రాణేశ! నీ వేడ ను
 న్న, రయం బారఁగ వచ్చి కొల్చెద నినున్ భక్తిప్రపూర్ణాత్మ నై.

నాథా! నాథా! నా యపరాధము మన్నించి, నాకు మార్గ దర్శివి కమ్ము! (అనుచు, పొడుచుకొనఁబోవును.)

[వసిష్ఠవిశ్వామిత్రు లాత్రముతో ప్రవేశింతురు.]

విశ్వామిత్రుఁడు—ఆఁగు మాఁగుము! నీ భర్త బ్రతికియే యున్నాఁడు. నీ భాగ్యము ఫలించినది!

తే. పొగుల నేటికి? సాధ్వి! నీ పుణ్యవశత
 జీవితేశ్వరుఁ డైన ప్రాచేతసుండు,
 మొనసి బ్రహ్మర్షి యై, మునుముందు నీ క
 కరుణమై మోక్షగతి చూపఁగలఁడు పొమ్ము!

మోహనాంగి—స్వాములారా! నమస్కరించుచున్నదాన; పతి బ్రతికియున్కి మీ యనుగ్రహఫలం బని యానందించుచున్నదాన. (అనుచు భర్తయొద్దఁ గూర్చుండి, మోము

తుడిచి, కన్నీ రొత్తుకొని, పైఁట చెఱఁగుతో విసరుచు) కటకటా! నీ కెట్టి గతి పట్టించితిని!

తే. కుసుమకిసలయశయ్యపైఁ గూడ నాదు
బాహు వుపధానముగ లేక పండుకొనవు;
నేను బ్రతికియుండంగ నే, ప్రాణనాథ!
నిరుపధానభూతలశయ్య నీ కి దేల?

(అనుచు, ప్రాచేతసుని తల తన తొడపైఁ బెట్టుకొనఁబోవును.)

వసిష్ఠుఁడు — కుమారీ! లేచి యిటు రమ్ము. ఇతని పరిణతి నేల భంగపఱిచెదవు? పతిప్రాణల కిది పాడియా? తడయుట తగదు; వెంటనే యింటి కేఁగుము. నీ కెంతటి మహాత్త్వము చేకూఱనున్న దో చూడుము:

క. రుచ్యఫలసమర్పణమున
నచ్యుతు ప్రత్యక్షమూర్తి నర్చించి, యని
ర్వాచ్య మగు భక్తి ఫలముగ
నచ్యుత కైవల్యపదవి నం దెదవు తుదిన్!

మోహనాంగి — అయ్యా! నా పతి యి టుండ, నే నె టేఁగుదును? ఇతని యునికిపట్టె నా యిల్లు; ఇతని నుప చరించుచుండుటయే నా జీవితధర్మము. (ఆలోచించి, స్వగత ముగా) వీరి ప్రవర్తన మేమో సందేహాస్పదముగఁ దోఁచు చున్న దే! * * * కాపాలికులు కారు గద? కాకున్న, న న్నిట్లేల తఱిమెదరు? (ప్రాచేతసుని నాడి పరీక్షించుచు) నాడి యాడుటయే లేదే, ఇతఁ డెట్లు సజీవుఁడు? ఎంత బేలు పోయితిని! వీరి రాకయే నా నాథుని నిర్జీవావస్థను నిరూపించు

చుండ, వీరి మాటలు నమ్మి యూఱడిలుచుంటినే! హా, జీవితేశ్వరా! ఎంతటి యభాగ్యురాలను! (అనుచు మూర్ఛ వోవును.)

విశ్వామిత్రుఁడు — మిత్రమా! ఈమె పతిభక్తికి మితియే యున్నట్టు లేదు!

వసిష్ఠుఁడు — కనుకనే, ప్రాచేతసుఁ డప్పు డీమె నంతగా ప్రస్తుతించె.

ప్రాచేతసుఁడు — (పొరలును.)

విశ్వామిత్రుఁడు — ప్రాచేతసుఁడు మేలుకొనుచున్నాఁడు.

వసిష్ఠుఁడు — మేలుకొనుఁగాక! మంత్రబీజము మహావృక్షమై, అమృతఫలప్రదాయకం బగునుగాక! మన మిఁక పోవుదము, రమ్ము. (అనుచు నిష్క్రమించును.)

విశ్వామిత్రుఁడు — (వసిష్ఠు ననుగమించును.)

ప్రాచేతసుఁడు — (మోహనాంగిని చూడకయే వడఁకుచు లేచి, కనులు నలుపుకొని యాశ్చర్యపడుచు, స్వగతముగా) చచ్చి బ్రతికితినా, చావకయే బ్రతికియున్నాఁడనా? ఇప్పటికిని స్ఫురించి యొడలు గడగడలాడించుచున్న నా నరకానుభూతి స్వాప్నిక మనుటకు వలనుపడదు. * * * చచ్చి బ్రతికితి ననియే నిశ్చయింపఁ దగియున్నది. * * * ఉత్క్రమించిన జీవుఁ డీ దేహమందే మరలఁ బ్రవేశించుటచేత, నాకీ

నరకశిక్షాస్మృతి సిద్ధించియుండును. * * * ప్రాణికోటులా యవాంతరవ్యత్యస్తావస్థలు పూర్వజన్మకర్మఫలానుసారము లని పునర్జన్మసిద్ధాంతముచే సమర్థింపఁబడుచున్నదే, జన్మజన్మాంతర మధ్యంగతము లయ్యెడి నరకశిక్షలవలని ప్రయోజన మేమి? విశేషించి, భవిష్యజ్జన్మంబున స్ఫురింపని యీ నరకశిక్షల వలని ప్రయోజన మేమి? * * * వితర్కించి చూచు నెడల, సృష్టిస్థితిలయంబులవలని ప్రయోజనమే మృగ్యము. * * * భగవద్విలాసము మానవజ్ఞానాతీతము. అయినను, భగవదనుగ్రహము ఫలించుచో, గ్రహింపరాని యతీంద్రియార్థ మేమి కలుగఁగలదు? (స్మృతి నభినయించి యాశ్చర్య పడుచు) ఆహా! ఏమి యీ మధురాక్షరసమ్మేళనము! ఏమి యీ యద్వయానుసంధానవిధానము! (ఆనందించుచు) దారి దొరకినది; ధన్యుఁడ నైతిని! * * * సందియము లేదు. ఇదంతయు పరోక్షముగ లభించిన గురుప్రసాదమే! * * * ఆ మహానుభావు లిం దెం దైనఁ గల రేమో? (అని యన్వేషించుచు, మోహనాంగిని జూచి) ఇ దెవరు? మోహనాంగి వలె నున్నదే! * * * ఇది తట్టి చూపినం గాని, నాకు నా తప్పు తట్టినదే కాదు; ఇదియు నాకు గురుస్వరూపమే! కటకటా! కృతఘ్నుఁడ నై దీని కెంత దుర్గతి పట్టించితిని! (అనుచు, సకరుణముగ చూచి యుత్తలపడుచు) పైఁట చెఱంగునందలి యీ నెత్తురు మఱక లేమిటి? పాపము శమించుఁగాక! పాపము శమించుఁగాక! నా నిమిత్త మీ సాధ్వి యెంతటి కష్టముల పా లగుచున్నది! నా నిర్జీవకళేబర

ముం జూచి యాత్మహత్య గావించుకొనలేదు గద? (అనుచు నాత్రముతో) మోహనాంగీ! మోహనాంగీ! (అని తట్టి లేపును.)

మోహనాంగి — (ఉలికిపడి లేచి) నాధా! నాధా! ఉభయులము సజీవులమా? ఉభయులము సజీవులమా? ఏమి మన భాగ్యము! (అనుచు, కౌఁగిలించుకొనఁబోవును.)

ప్రాచేతసుఁడు — (ఇంచుక తొలఁగి, ఆత్రముతో నెత్తుటి మఱకలు చూపుచు) ఆ రక్తచిహ్నము లేమిటి? ఆ రక్తచిహ్నము లేమిటి?

మోహనాంగి — (వినిపించుకొనకయే) ప్రాణేశ్వరా! ఒండొరుల నెడఁబాసి యుండియెఱుంగమే, ఆకస్మికముగ మన మీ యకారణవియోగదుఃఖము పాలగుట కేవలము గ్రహచారదోష మని తోఁచుచున్నది. తద్దోషపరిహారార్థము దేవిని సేవించుకొని పోవుదము రమ్ము. ఆమె యనుగ్రహము వలననే ని న్నిపుడు కలసికొనఁ గంటిని! (అనుచు, చేయి పట్టి తీసికొని వెళ్లఁబోవును.)

ప్రాచేతసుఁడు — (తప్పించుకొనుచు, సకరుణముగ) మోహనాంగీ! చెప్ప వేల? నా చిత్తముం దత్తఱింపఁ జేయు చున్న యీ నెత్తుటి మఱక లేమిటి?

మోహనాంగి — అ వేమో నాకు తెలియదు. * * * ఇంత నవనీతకోమలహృదయుఁడవే, కేవలజీవకారుణ్యమూర్తివే, అనావశ్యకముగ నాపై నాగ్రహించినపుడీ సౌహార్ద

మంతయు నే మైపోయినది? ఇ దెల్ల గ్రహచారఫలము గాక, మఱేమి కాఁగలదు? అ దేమి చిత్రమో, నీ చేసిన ప్రమాణములు సైతము పాటింపవైతివి! నాధా! నా వైపు చూడుము. పాఱిపోయిన పెంపుడు లేడి నన్వేషించుచు నీ వానాఁడు దారి తప్పి మా యారణ్యము ప్రవేశించితివి; దయచేసి యించుక జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము.

ఉ. 'పైపడు బెబ్బులిన్ దునిమి ప్రాణము గాచితి!' వంచు, భావము
దీపితవృత్తి గాఁగ, 'వనదేవతవే!' యని మ్రొక్కి, 'కా' ననన్,
చూపులలో మెలంగెడి మనోజుఁడు సాక్షిగ 'బాస' లందు నే
మో పచరించి; తా పరిణయోక్తుల నప్పుడ విస్మరించితే?

ప్రాచేతసుఁడు — (ఎగ దిగఁ జూచి) ప్రేయసీ! ఇప్పటికిని నీ వా నవమోహనాంగివే! నా ప్రాణేశ్వరివే! (అని చుబుకము పుణుకుచు) నీ బాధ యేమో తెలియక బాధపడు చున్న న న్నింకను బాధపెట్టెద వేల? ఆ మఱక లేమిటి? అ వెట్లు నీకు తెలియక కాఁగలవు?

మోహనాంగి — (వెక్కి వెక్కి, కన్నీ రొత్తుకొనుచు)

ఉ. చెప్పు మటంచు నీ వడుగఁ, జెప్పకయుండుట తప్పు; చెప్పినన్,
దప్పును మోపిన ట్లగును దద్దయు నీపయి; నేమి సెప్పుదున్?
నొప్పి సహించి దాఁచితిఁ, గనుంగొని నొచ్చెద వంచు; నక్కటా!
బొప్పిని దాఁపలేనయితిఁ, బొక్కిన రక్తము పట్టి యిచ్చుటన్!

(అనుచు, గాయము చూపి విలపించును.)

ప్రాచేతసుఁడు — (కన్నీ రొత్తుకొనుచు, నేపథ్యములోని కేఁగి యేదో పచ్చాకు తెచ్చి, పంచె కొంగు చించి కట్టు

కట్టుచు) ప్రాణేశ్వరీ! హృదయ మగ్ని లేకయే నిర్దహించుకొనిపోవుచున్నది! నీవు నా త్రోచిన త్రోపునం బడినపుడీ గాయము గండోపలహతిం దగిలె నని తెలుపకయే తెలియుచున్నది. ఈ క్రూరుఁ డిది యెఱింగిన నొచ్చుకొను నని యింకను పరితపించుచున్నదానవా? ఎంతటి ప్రేలవు! ఆ నాఁడీ పాపాత్ముని ప్రాణములు గాపాడుటయే నీ యొనర్చిన మహాపరాధము. కర్కోటకునిఁ గాపాడిన నలుని గతి పట్టించుకొంటివి! * * * ఆ బాఁకి టిమ్ము; (పండ్లు కొఱకుచు) ఈ ప్రాచేతసహతకునకు తగిన దండనము గావించెద! (అనుచు, పెనఁగులాడి బాఁ కందుకొనఁబోవును.)

మోహనాంగి—(వారించుచు) అయ్యయ్యో! అయ్యయ్యో! బాఁకుతో పొడుచుకొందువా యేమి? ఆ కాపాలికులు మచ్చు చల్లి తమ కార్యమును నీచేతనే చేయించుకొనుచున్నట్లున్నదే! ఏమి చేయుదును?

ప్రాచేతసుఁడు— కాపాలికులా? ఏ కాపాలికులు?

మోహనాంగి— వారెవరో, యిరువురు సన్న్యాసులవలె వచ్చిరి; ఏమేమో యాసలు గొలిపి, నిన్ను విడిచి పొమ్మని నన్నెంతయు బలవంతపెట్టిరి.

ప్రాచేతసుఁడు— వారెక్కడ? వారెక్కడ? వారే కావలయు నా గురువరేణ్యులు! (అనుచు నలు కెలంకులు

వెదకి, తారకమంత్రస్మరణ నభినయించి, విహ్వలుఁ డై దిక్కులు చూడసాగును.)

మోహనాంగి — కటకటా! వారి మాట యెట్టులయో కష్టకారణ మైన ట్లున్నదే! ఏమి నా గ్రహచారము! ఏమి చెప్పినను, విపరీతముగ పరిణమించుచున్నదే! నాథా! నాథా! మరల వెఱ్ఱిచూపులు చూడఁ జొచ్చితి వేల? వారి మంత్రము పాఱుచున్నదా యేమి?

ప్రాచేతసుఁడు — ఓసి మూర్ఖురాలా! వారిని దూఱి పాప మేల యార్జించుకొనెదవు! వారే నన్నుద్ధరింప విచ్చేసిన మహానుభావులు, మంత్రోపదేష్టలు! ఇంతలో నింత కార్య విమూఢుఁడ నైతినే యని చింతించుచున్నాఁడ.

ఉ. పుణ్యపథప్రవృత్త మగు బుద్ధిని తారక మొక్క వంకఁ గా
రుణ్య మిఁకొక్క వంక ననిరుద్ధబలంబున నీడ్వఁ బొల్చె; దా
క్షిణ్యముఁ గార్యమే యయినఁ, గేవలపాపికి సత్వరంబ ప్ర
పుణ్యతపోజపంబుల నఘార్తిని బాయుటె ధర్మ మారయన్!

(అనుచు నిష్క్రమింపఁబోవును.)

మోహనాంగి — (ప్రాచేతసుని చేయి పట్టుకొని) పోయెదవా, పోయెదవా? నాథా! నన్నేమిచేసి పోయెదవు? నా కేమి గతి చెప్పెదవు? (అనుచు విలపించును.)

ప్రాచేతసుఁడు — (పెడమోము పెట్టుకొని తప్పించుకొనుచు) ఏమి చెప్పవచ్చును?

ఉ. కాలమహాప్రవాహమునఁ గట్టెలు రెం డెటో తారసిల్లి, క
ల్లోలహతిన్ బరస్పరము లోఁగొని తాఁకు; నదే కతంబుగాఁ
జీలును; జీలియున్ మరలఁ జేరఁగవచ్చును, జేర కంత నే
తూలఁగవచ్చుఁ; దద్గతులు దుస్తరనిత్యవితర్క్యమూలముల్!

సమస్తము కర్మవశముగఁ దోఁచుచున్నది.

మోహనాంగి— (ఆశ్చర్యముతో నిశ్చేష్టురాలై చూచుచుండును.)

ప్రాచేతసుఁడు— (భక్తిపారవశ్యముతో)

తే. రామా! రామా! రామా! రామా! - రామా! రామా! రామా!
రామా! రామా! రామా! రామా! - రామా! రామా! రామా!

(అని పాడుచు తటాలున నిష్క్రమించును.)

మోహనాంగి— (తెలివి తెచ్చుకొని) నాథా! నాథా!
(అని యేడ్చుచు, ప్రాచేతసు ననుగమించును.)

శ్రీ రస్తు

# వాల్మీకి

## పంచమాంకము

(ప్రథమరంగము : ప్రాచేతసతపః ప్రదేశప్రాంతము)

కోలాహలుడు — (వెదకుచు ప్రవేశించి) వెదకి వెదకి వేసారితిని. ఈ పరిసరములందే కదా ప్రాచేతసులు తపం బొనర్చుచుండెదరని వేగులు విన్నవించిరి? తపమునకేగినవాం డింతలో నెట్లు మాయ మయ్యెనో తెలియరాకున్నది. నన్నాం టనె వచ్చి యతనిని సేవించుకొనుచు పడియుండ నెంచితిని గాని, రాజ్యసంరక్షణభారమును మునివార్యకార్య మయ్యె. ***కన్న తల్లికన్న మిన్నగ నను పెంచిన బ్రేమ గురించిన మోహనాంగీ దేవి నోదార్చునప్పటికి నా తలప్రాణములు దిగివచ్చిరి! భర్త్రుపవియోగ మే దుర్భర మగుచుండ, గోరుచుట్టుపై రోకటిపో టన్నట్లామెకు పుత్రికావియోగము కూడ సంభవించె. పాప, మా చమత్కారిణి యే మయ్యెనో యిప్పటికిని దెలియలేదు. వయసు మీరిన యాడుబిడ్డకు బలాత్కారప్రస్తావ మెట్లు ఘటింప నేటికి? అది యే మగపురుగునో చూచి సన్నివేశ దపి దానిని తన్నితలుచు నేటికి? ఇంతకును, మోహనాంగీదేవి గ్రహచారము సరిగా లేదు. కాని, ఆమె ప్రజల దుఃఖములో తన దుఃఖమును మఱచి నాకు తోడుపడనియెడల, నాగి నోదార్పం

గలిగియుండునో లేదో నాకే సందేహము. * * * చోర వృత్తి హేయ మందురే కాని, వారి భక్తివిశ్వాసము లెంతయు ప్రశంసనీయములు! వంశానుక్రమముగ వచ్చిన వృత్తిని పరిత్యజించుట యన్న సామాన్యమా? అయినను, అదియే గురుభక్తికి గుఱు తన్నంత మాత్రమున వారియం దెట్టకేలకు స్వామిభక్తియే యతిశయించె! * * * గృహాంగడు పరిపాలన భారము వహించుట నా భాగ్యవిశేషము. కాని, యీ పను లన్నియుఁ బక్కఁబెట్టి వచ్చునప్పటికి ప్రాచేతసుని జాడయే కానరాదయ్యె. * * * దైవమా! ఇంకను నన్నీ దురవస్థలో నెంత కాల ముంచెదవు?

ఉ. గురువరు పాదపద్మములు కోరిక మీఱ భజింతునేని, భా
సుర మగు నీదు నామము త్రిశుద్ధిగఁ బూని జపింతునేని, స
త్వరమ తదీయదివ్యపదదర్శనభాగ్య మనుగ్రహింపుమా,
పరమకృపానిశాంత! భగవంత! ముముక్షుఁడ, మ్రొక్కి వేఁడెదన్.

(అని వెదకికొనుచు నిష్క్రమించును.)

ఇది విష్కంభము

---

(ద్వితీయరంగము: ప్రాచేతసతపఃప్రదేశము)

[ప్రాచేతసుఁడు వల్మీకాచ్ఛాదితుఁడై తపం బొనర్చుచుండును.]

విశ్వామిత్రుఁడు — (ఆనందముతో ప్రవేశించి, వల్మీకముపై దృష్టులు సారించుచు)

తే. యత్న మొనరించి యంతరాయములు గడచి
  యభిమతార్థంబు సాధించినపుడు కలుగు
  సంతసమె సంతసం; బగి సాధనంపు
  శ్రమ కొలంది భోగ్యం బయి జనులఁ దనుపు!

(చేయి వెనకకు చాఁచి, లేని వసిష్ఠు నున్నట్లు భావించి పిల్చుచు) మిత్రమా! ఇం దిఁకొక విశేషము గలదు, గంటివే?

ఆ. సాధనశ్రమానుసారి మాత్రమె కాదు,
  సాధకునకుఁ గలుగు సంతసంబు
  సాధితార్థగౌరవాధిక్యము కొలంది
  నతిశయించి భోగ్య మగుచునుండు!

ఇది నా కెంతయు ననుభవైకవేద్యము! కాని, ఈ యువజనుని మనోనిశ్చయమును ప్రారంభపాటవమును పరికించి చూడ, నాకే లజ్జ * * * (అనుచు వసిష్ఠుని వైపు చూడఁబోయి, అతఁడు లేకుండుటను గని, ఆశ్చర్యముతో) ఏ మిది? నా మిత్రుఁ డున్నాఁ డని నే నేమేమియో మాటాడుచుంటినే! కూడ వచ్చుచుండిన యతఁ డింతలో నెటు పోయెను?

[వసిష్ఠుఁడు మందగమనముతో, నేమియో యాలోచించుకొనుచు, ప్రవేశించును.]

విశ్వామిత్రుఁడు — మిత్రమా! ప్రక్కనే వచ్చుచుండినవాఁడ వేల వెనుకఁబడితివి?

వసిష్ఠుఁడు — వచ్చుచునే యుంటిని. కాని, యీ వల్మీకమును చూచినంతనే నాకేమో మనోవికారము కలుగఁజొచ్చినది. ప్రచండవాతాహతం బైన దీపకళికవలె,

నా చిత్త మనివార్యసంశయాకులిత మై యల్లాడుచున్నది. సమీపించు కొలంది కాళ్లు సైతము తొట్రిలుచున్నవి.

విశ్వామిత్రుఁడు—సర్వవిధముల సంతోషింపఁదగిన యీ సమయమున, నీ కిట్టి వికార మేల జనించె? (నవ్వుచు) మాత్సర్యగ్రస్తుఁడవు కావు గద!

వసిష్ఠుఁడు— మిత్రమా! మాత్సర్య మేటికి? "పుత్రా దిచ్ఛేత్పరాజయ" మ్మందురు గదా పెద్దలు! కాని, చిరకాలము నేనును నీవును తల క్రిందుగ తపం బొనర్చి కాని సంపాదింపలేని నిర్వికల్పసమాధి యితని కెంత శీఘ్రముగ లభించెనో కంటివి గదా? దీనికి హేతువు సాధకవ్యత్యాసమా, సాధనవ్యత్యాసమా?

విశ్వామిత్రుఁడు—(మందస్మితముతో) ఇదియా నీ సందేహము? దీని కింత వితర్క మేటికి?

వసిష్ఠుఁడు—కర్మజ్ఞానయోగ ప్రతిష్ఠాపనాచార్యుల మైన మనకు సైత మితని చరిత్ర మన్నములోని రాతివలె కొఱుకుడుపడకుండుట లేదా?

విశ్వామిత్రుఁడు—అవు నవును! ఆనందపారవశ్యమునం జేసి యరయ నైతి. హేతువాదాతీత మైన భక్తి మన కనుల ముందరనే యితని కమోఘఫలప్రదాయిని యయ్యె! నిన్న మొన్నవలె నున్న దితని తపఃప్రారంభము!

వసిష్ఠుఁడు— మోక్షమార్గములలో భక్తి యొకటి యనుకొంటిమే కాని, అది యిట్టి దనియు దాని కింతటి

ప్రభావము కల దనియు తెలియ మైతిమి. ఇది మనకు బోధించు కొఱకే నారదమహర్షి మనల నీ ప్రాచేతససంస్కార కార్యము నియోగించెనా యేమి? కానిచో, తానే యేల సంస్కరించియుండరాదు.

విశ్వామిత్రుఁడు— (ఇంచుక రోషముతో) నారదుఁడందఱ నవమానపఱచుచుండు నందురు. మనలఁ గూడ తన చక్రములోనికి దించెనా యేమి? (రోషోద్రేకముతో) కాలాహితోనా చెలగాటము!

వసిష్ఠుఁడు — (చిఱునవ్వు నవ్వుచు) మిత్రమా! రోష మేమిటికి? ఆ మహామహుని చక్రములోనికి దిగిన నాఁడు జీవి తరించినట్లే సుమా! అతఁ డయాచితముగ వచ్చి మనకు భక్తిప్రభావంబు గఱపిపోయె. శిష్యులయం దిట్టి యవ్యాజప్రేమము ప్రశంసనీయమే కదా?

విశ్వామిత్రుఁడు — (రోష ముపసంహరించుకొని, ఇంచుక యాలోచించి) నీ పలికిన దెంతయు నిజము? అతఁడవ్యాజప్రేమస్వరూపుఁడే. కాని యెడల, ఈ ప్రాచేతసున కిట్టి మహత్త్వ మెట్లు సిద్ధింపఁగలదు?

వసిష్ఠుఁడు — కావుననే, ఇతని తపోమహత్త్వ మనన్యసామాన్యమై యతిశయించుచున్నది.

తే. ఈ తపోనిష్ఠ యద్భుతం, బెందుఁ గనము;
స్థాణు వని యెంచి చెద లంటెఁ దనువు నిండ!
జ్ఞానచక్షుర్వికాసభాస్వరుఁ డితండు
స్థాణుమూర్తియె యని యాత్మఁ దలఁచువాఁడ!

విశ్వామిత్రుఁడు — నిజము, నిజము! ఇటే యోరకు వచ్చి చూడుము!

తే. అల తపోగ్నిశిఖాదీప్త నలముకొనిన
వింత వల్మీక మత్యంతకాంతిమంత
మగుచు వేదత్రయాత్మకుఁ డైన సూర్యుఁ
గప్పిన వినీలమేఘంబు కరణిఁ దోఁచు!

వసిష్ఠుఁడు — మిత్రమా! నీలమేఘమును వారించి బాలార్కుని చూడఁ గుతూహల మగుచున్నది. ఇతని నించుక ప్రబోధింపుము!

విశ్వామిత్రుఁడు — (ఉత్సాహముతో) ప్రాచేతస ఋషీశ్వరా! లేచి రమ్ము! గురువుల యాజ్ఞ యైనది!

ప్రాచేతసుఁడు — (పుట్ట బద్దలు చేసికొని ప్రవేశించి బద్ధాంజలి యై స్వగతముగా) ఏమి యీ దివ్యశ్రవణము! ఏమి యీ దివ్యదర్శనము! ఇది సత్యమా, స్వప్నమా? నా యింద్రియములనే నే నిపుడు సమ్మఁజాలకున్నాఁడను.

వసిష్ఠుఁడు — వత్సా! ఇది సత్యమే కాని, మ త్రే మియుఁ గాదు. మున్ను జననీగర్భంబుననుండి వెలనే యిపుడు మరల వల్మీకగర్భంబుననుండి యుద్భవిల్లి సార్థకద్విజుండ వైతివి! ఈ పునర్జన్మపుణ్యకాలంబున నీకు వాల్మీకి యని నామకరణంబు చేయుచున్నారము.

వాల్మీకి — (కనులు నులుపుకొని తేఱి పాఱఁ జూచి, పూర్వస్మృతి నభినయించి ప్రణమిల్లుచు) గురువరేణ్యులారా!

మీ కడి ప్రణామిల్లుచున్నాఁడను. (లేచి) ఈ ఘనసజ్జనస్తంబున నాకు మీరే సిరులు. మహర్షిమండలమండనాయమానులైన వసిష్ఠవిశ్వామిత్రులని మిమ్ము గుర్తింపనేరనైతిని. అజ్ఞానకృతంబులైన నా యపరాధములు లసంఖ్యాకములు; క్షమింపుఁడని వేఁడుటకు సైతము నోరాడకున్నది. జగద్విఖ్యాతచరిత్రులఁ బవిత్రుండనైతి నని గర్వింపఁదగిన యీ సమయమందు సశిష్యుండనై గావలసివచ్చుట కేవలదురదృష్టము.

విశ్వామిత్రుఁడు — కుమారా! నీ కా వంతలో పని లేదు. నిన్నుద్బోధించుట మాకు విధాయకము. విశేషించి, నారదమునీంద్రుని ప్రేరణము నవ్యాఖ్యాసిద్ధికి కారణము!

నారదుఁడు — (ప్రవేశించుచు, స్వగతముగా)

తే. అసమసంకల్పసిద్ధి* జ్ఞానాభివృద్ధి†
యకృతకాత్మోపలబ్ధియు‡ నమర నొకట!
అవని యంతయు శాంతిరసాబ్ధి యగుత;
భక్తికల్లోలజాలముల్ ప్రబలుఁగాక!

వసిష్ఠుఁడు, విశ్వామిత్రుఁడు — దేవర్షిచంద్రమా! నమస్కరించుచున్నారము.

వాల్మీకి — (చేతులు మోడ్చుకొని, నారదుని వైపు సవినయముగ చూచుచుండును.)

నారదుఁడు — బ్రహ్మర్షులారా! ప్రత్యభివాదనంబులు. (నవ్వుచు) వానప్రస్థులయ్యు, మహర్షులు స్వర్గాభివృద్ధి

* తన్నుఁ జూపుకొనుచు; † వసిష్ఠవిశ్వామిత్రులఁ జూపుచు; ‡ ప్రాచేతసునిఁ జూపుచు.

గావించుకొనుచున్నట్టే యున్నది; చాల సంతోషము! (వాల్మీకిని జూపుచు) ఈ పిల్ల జడదారి యెవరు?

వసిష్ఠుఁడు—మునీంద్రా! దీపము వెలిఁగించి, కాంతి యెక్కడి దని యడుగుచున్నాఁడవు! (వాల్మీకి వంకఁ జూచి, నారదునిఁ జూపుచు) వత్సా! ఇతఁడే సుమా నారదమహర్షి; నీకును మాకును గురుపీఠము!

వాల్మీకి—(నారదునకు పునః ప్రణామం బాచరించుచు) గురువరేణ్యా! ప్రాచేతసుఁ డిదె ప్రణమిల్లుచున్నాఁడు.

నారదుఁడు — బాలకా! పునర్జన్మపుణ్యకాలంబున నీ గురువులు పెట్టిన పేరు నీకు నచ్చలేదు కాఁబోలు! అవుతే, పాపము! ఆ పాడు పుట్టలో చెదలు తెగఁగుట్టియుండవలెను.

[వసిష్ఠుఁడు, విశ్వామిత్రుఁడు నవ్వుదురు.]

వాల్మీకి—(మందహాసముతో) దేవర్షిచంద్రమా! వాల్మీకి యిదె నమస్కరించుచున్నాఁడు. గురువరానుగ్రహ విశేషంబుచే నా కట్టి బాధ యేమియు కలుగలేదు.

విశ్వామిత్రుఁడు—వత్సా! నీ యేకాగ్రత కెంత వెఱఁగందితిమో, నీ వినయవిధేయతల కంత సంతసించుచున్నారము.

వాల్మీకి—గురువర్యా! వినయ మనెద వేల? (ముువ్వుర నుద్దేశించి) అకారణకారుణ్యము వహించి నన్నుద్ధరించిన మీకు, కృతజ్ఞతాపూర్వక మైన నాభక్తి నెట్లు వ్యక్తీకరింపవలెనో తెలియకున్నది.

తే. మూఁడు మూర్తులఁ బోలు మీ మువ్వు రిపుడు
నా గురువు లంచు నెంద మానంద మందు;
ఆ పరబ్రహ్మముంబోలె నధికభక్తి
నీ గురుబ్రహ్మము భజింతు నెల్ల ప్రొద్దు!

నారదుఁడు — వత్సా! నీ భక్తి కెంతయు సంతసించితిమి. లోకహితం బగు నిరుపమానఘనకార్య మొకటి నీచే నిర్వహింపఁబడవలసియున్నది. కనుకనే, నీకొఱకు మే మందఱ మింతటి ప్రయత్న మొనర్చితిమి. నీవు తమసానదీతీరంబునం దాశ్రమము కల్పించుకొని, శిష్యసమేతముగ మా యాజ్ఞ నిరీక్షించుచుండుము.

వాల్మీకి — మహాప్రసాదము!

వసిష్ఠుఁడు — (వాల్మీకి నుద్దేశించి) ఋషీంద్రా! నీ నమ్మిన బంటు కోలాహలుఁ డీ ప్రాంతములందే నిన్నన్వేషించుచున్నాఁడు. ఆ యకలంకచరిత్రుఁడు నీ యనుగ్రహమునకు పాత్రుఁడు.

విశ్వామిత్రుఁడు — నిజము, నిజము! శుష్కించియున్న నీ కిపుడు శుశ్రూషలు చేయుట కతఁడే తగినవాఁడు. కావున, నీ వతనిని భరద్వాజుం * డను పేర ప్రథమశిష్యునిగ పరిగ్రహింపుము.

వాల్మీకి — గురువరేణ్యుల యాజ్ఞను శిరసా వహించుచున్నాఁడ.

* భరత్ + వాజః = భరద్వాజః — అన్నదాత యని భావము.

నారదుఁడు — వత్సా! నిన్నుఁ జూచు కొలంది, నా యెడంద యమందానంద మందున్నది. మన కచిరకాలంబు ననే పునస్సమావేశము సమకూరుఁగాక!

వాల్మీకి — మహాప్రసాదము!

నారదుఁడు —

పా. సహస్రశీర్షా! సహస్రనేత్రా! - సహస్రపాదా! పూరుషా!
స్మరించి వేఁడెద; హరించి పాపము, - తరింపఁజేయుము లోకము

(అని పాడుచు నిష్క్రమించును.)

తక్కిన యందఱు — (నారదు ననుగమింతురు.)

శ్రీరస్తు

# వాల్మీకి

## షష్ఠాంకము

( ప్రథమరంగము : నిషాదకుటీరము )

నిషాదుఁడు —— ( మైకముతో లేచి కూర్చుండి, నిషాది నుద్దేశించి )

పా. వొంట శేశినావొ లేవో - పెంటీ! నువు బేగి శెప్పు,
మంట లేశినాది పొట్టలో! - వోశోశి పెంటి! మంట.

నిషాది —— ( కోపముతో ప్రవేశించుచు )

పా. గింజ లేదు, గిట్ర లేదు; - గుంజాలె కూకుండావు!
యే మెట్టి వొండ మంటవూ? - వోరోరి గండ! యే మెట్టి.

నిషాదుఁడు —— ( నిలుచుండి యించుక కోపముతో )

పా. కొట్టు కొట్టు తిరిగినావు, - తట్టబుట్ట లమ్మినావు;
రూక లేమి శేశినావే? - వోశోశి పెంటి! రూక.

నిషాది —— ( చిఱునవ్వుతో )

పా. ఆ శె ట్టెక్కి యీ శె ట్టెక్కి - గీశినాను, దాశినాను;
కల్లంతా నువ్వేమి శేస్తివీ? - వోరోరి గండ! కల్లంతా.

నిషాదుఁడు — (కోపముతో)

పా. సద్ది కూడూ నువు తి న్పోతే, - సవ్వాని కల్లూ నా స్తా గేస్తి ;
రూక లేమి శేశినావే? - వోశొశ పెంటి! రూక.

నిషాది — (వికటముగ నవ్వుచు) నా న్నెప్ప, న్నవు కనుక్కో సూస్తం!

నిషాదుఁడు — (నవ్వుచు) నాకు తెల్దనుకుండవా యేం? ను వ్వేడనో దాస్కునుంటవు!

నిషాది — (నవ్వుచు) నా న్దాస్కుంటే, అయి కూడ దూశేస్కుండ మనుకుండవా? నీశాత శిక్కుండ, నా నియ్యాల బలే ప న్నేస్కొచ్చా!

నిషాదుఁడు — అ దేం దొలే? శెప్పు సూస్తం!

నిషాది — (మురియుచు)

పా. ముక్కు నూడు, - ము క్కుందం నూడు;
ముక్కుకు తగ్గా - ముక్కెర నూడు!
గండా! ముందల్లే నా నుండానా? గండా!

2. కళ్లు నూడు, - క ళ్లందం నూడు;
కళ్లకు తగ్గా - కాటిక నూడు!
గండా! ముందల్లే నా నుండానా? గండా!

3. ఆకులు తెస్తీ, - పోకలు తెస్తీ,
పోకల కెచ్చా - పొగాకు తెస్తీ!
గండా! మన మల్లా తిరిగొద్దామా? గండా!

నిషాదుఁడు — (కోపముతో) నా నో మూల కూడు లేక మాడి సస్తుంటే, నీకు శింగారాలుగాను శికార్లుగాను వుండదా? రూకి లెట్టి సూక లేకుండా, యిదా నీవు శేస్కొచ్చింది!

నిషాది — (కోపముతో) నా నోస్నెట్టుకుంటే, నువు సూళ్లేవు. నా న్బాగుంటే, నువ్వే పొద్దు సంతోసం గుండది?

నిషాదుఁడు — (కష్టపడి నవ్వి, నిషాదిని తట్టి నిమురుచు) కోకశించుకోకు, నీ కాళ్లకు మొక్కుతా: నువు బంగారు పిచికా లుండవు! * * * నీ కాక ల్గే దాలే?

నిషాది — లేకేం! సొమ్ము ల్నందక్గో తోసలే. అల్లాడ సూడు, రొండు పిట్టలా శెట్టుమీాద సిల్లాట లాడతుండయి; బద్ద తీస్క పోయి, ఆ ట్నేస్కరా. నా నీ లోంగా పుల్లా పుడకా యేరకొస్తా (అని నిష్క్రమించును.)

నిషాదుఁడు — (ఉండవింటి బద్ద నందుకొని, యథోచితముగ నాడుచు)

పా. కులుకూ పిట్టాలా జంటా!
కొవ్వెక్కి వుంటా దీ వొంటా! - వవ్వా! కులుకూ.
2. కడుపు నిండా తింటా నంటా!
కైపెక్కి తొంగుంటా నంటా! - వవ్వా! కులుకూ.

(అని పాడుచు, గుఱి పెట్టి పిట్టను గొట్టి నిష్క్రమించును.)

ఇది ప్రవేశకము

---

(ద్వితీయరంగము : వాల్మీక్యాశ్రమప్రాంతము)

నిషాదుఁడు — (చచ్చి పడియున్న క్రౌంచపక్షి నందుకొనుచుండును.)

వాల్మీకి — (స్నాతుండై భరద్వాజసమేతముగ ప్రవేశించుచు, కరుణరసోత్పన్నమైన న్యాయ్యాగ్రహముతో)

శ్లో. మా నిషాద! ప్రతిష్ఠాం త్వ
మగమ శ్శాశ్వతీ స్సమాః,
యత్ క్రౌంచమిథునా దేక
మవధీః కామమోహితమ్.

భరద్వాజుఁడు — (స్వగతముగ) ఆహా! ఏమి యితని యపారజీవకారుణ్యము! అపూర్వగానామృతరూపమున వెల్లివిరియుచున్నదే! (అని యాలోచించుచుండును.)

నిషాదుఁడు — (కోపాశ్చర్యము లభినయించుచు) నిషా మాన మంటవే, దా న్నజా నీ కేం తెల్సు? ఇంత గద్దు మాట్లో శెప్పేదాన్కి, అంత పోడు గ్గీపెట్టి పాట పాడ్డా వెందుకూ?

వాల్మీకి — (నిషాదుని గుర్తించుట నభినయించుచు, శాంతమతియై) నా యుద్దేశ మది కాదు, హింస మాను మనుచున్నాఁడను.

నిషాదుఁడు — అదా నీ 'మాని' కద్దం! మరి, మాని మమ్మ ల్నేం శెయ మంటవు? కడుపు కాల్సుకో మంటవా?

వాల్మీకి — ఓరీ! ఆఁకటి చిచ్చార్చుకొనుటకు జీవహింస యావశ్యకమా? ధాన్యములు, పండ్లు, దుంపలు, వేళ్లు, ఆకలములు — ఎన్నెన్నియో యున్నవే, ఏవి తినినఁ గడుపు నిండదు?

మ. పరమాత్ముం డగు దేవదేవునకు సర్వప్రాణులున్ గుల్యములు ;
కరుణావృష్టి నినుసు ననుసు సకలయును గాసాయు నారంభ ; సా
గరబుద్ధిన్ విడనాడి, క్రూరమునమార్గశాల్యాప్తి గర్వించి, స్వో
దరజంతుప్రతతిం భుజించు టగియును ధర్మంబె యుగ్రాత్మకున్ ?

నిషాదుఁడు — నీకు మాంసం తిని తెల్సు గా చూసు ! పెద్ద జీవాలు సన్న జీవాల్ని తినడం సాబానమే గందా ?

వాల్మీకి — ఓరీ ! బుద్ధిలేని క్షుద్రజంతువుల మార్గము మానవుల కనుసరణీయము ? ఈ క్రౌంచదంపతులకు మనవలెనే సుఖించుట కధికారము కలదు. నిర్దయుఁడవై వాని నేల వధింపఁబూనితివి ? ( తెర వంకఁ జూపుచు ) ఆ యాఁడుపిట్ట భయపడి పాఱిపోయి, భర్తృవియోగదుఃఖముచే నెట్లు దుఃఖించుచున్నదో చూడుము. దయాగుణము నీ వెఱుంగనట్లున్నది.

చ. ఉభయహితార్థమై, నియతి యొప్ప గ్రహింతుర నీంచి దానికిన్
శుభ మొనగూర్చు దేవుని విశుద్ధగుణం బనుకింప ; దైవస
న్నిభుఁ డగు మానవుండు, పనుసీయులపై దయ జూపుటన్ ; గృపా
విభవసుధాసువృష్టికి లభింపని కామ్యఫలంబు గల్గునే ?

నిషాదుఁడు — బడబడ లాడతా వొచ్చి నా శేతికి శిక్కే పిట్నిగరఁగొట్నవు, మా వాత మట్టి గొట్నవు ; యిదే గామోసు నువు శెప్పే దయ !

వాల్మీకి — నాయనా ! విచారపడకుము. ఈ విధముగా నైన నొక పక్షి రక్షింపఁబడినది గదా యని సంతోషింపుము.

సీ. పాతకపూర్ణ మీ భూతలం బంతయు ; - నింకను బాపంబు లేల సేయ ?
సార మెన్నఁ, బరోపకారంబె పుణ్యంబు;-పరపీడనంబె పాపంబుసుమ్ము ;
ధర నహింసాత్మకధర్మంబె ధర్మంబు ; - భూతదయాపరబుద్ధి బుద్ధి ;
భగవంతుఁడే తండ్రి, జగము కుటుంబంబు ; - భ్రాతృభావమె మన
అన్ని జాతులలోన జ్ఞానాధికంబు [ బాంధవంబు ;
మనుజజన్మంబు , బాధ్యతయును ఘనంబు ;
సోదరా ! నా మొ ఱాలింపు మాదరమున ,
ఈ కృపాశూన్యత త్యజింపు మింక నయిన !

నిసాదుఁడు — ( నోరు తెఱచుకొని చూచుచుండి ) ను వ్వేందో పెద్దపెద్దిసయాలు శెపుతున్నట్టుండది. నాకు సరిగా తెల్లేదు ; నా పెంటి నడిగి తెల్సుకుంటా. వోకేల దానికీ తెలకపోతే, మా మిద్దరం మల్లీ వొచ్చి తెల్సుకుంటాం. ( గురు శిష్యుల నుభయుల నుద్దేశించి ) మీకు దండం. ( అనుచు, చచ్చిన క్రౌంచమును దీసికొని నిష్క్రమించును. )

భరద్వాజుఁడు — గురువరేణ్యా ! గుర్తించితివా ? ఈ భ్రష్టుఁడు మన కుశీలవుఁడు ; మనల నానవాలు పట్టలేకపోయి నాఁడు. నల్లరాతి బండను దున్నఁబూనితివే యని విచారించు చుంటిని ; కాని, తుద కది కూడ నీ మహిమవలన నించుక మెత్తపడినది.

వాల్మీకి — అప్పుడే వానిని గుఱుతు పట్టితిని. ఇపుడు గాకున్న నింకొకప్పుడైన, వాఁడు మంచి దారికి మరల వలయు ననియే నా కోరిక. కాని, అనావశ్యకముగ వానిని శపించితినే యని చిత్త ముత్తలపడుచున్నది.

భరద్వాజుఁడు — నీవు శపించినను శపింపకున్నను, కర్మఫలానుసారము వాని యాయువు కొంత క్షీణింపవలసియే యున్నది కదా? న్యాయాగ్రహావేశముచే నైన నీ వా యర్థ మెఱుఁగి తీవ్రముగఁ బ్రకటించితివి. వానికి నీ విం దొనర్చిన యపకార మేమి?

వాల్మీకి — లేదు, నిజమే! కాని శాపోద్భవ భంగి పాపమున నాకు నేనే యపకారము గావించుకొంటిని. దానికే, మద టులపడితిని. పరంపరాభ్యస్త మగు నీచవిధానము నీ మూఢుఁ డెట్లు మాని బాగుపడఁగలఁడా యని నా విచారము.

భరద్వాజుఁడు — మహాత్ములకిట్టి సన్నివేశంబున సదమాధముల స్థితిని సముద్ధరింప సమకట్టిన మహాగురుని యనుగ్రహమున కసాధ్య మేమి కలుఁగఁగలదు? పురాకృతసుకృత లేశవశంబుననే, నీ కటాక్షభాగ్యము వానికిపుడు లభించినది.

వాల్మీకి — (చేతులు చాఁచి, యాకసము వంక దైన్యముతోఁ జూచుచు) పరమేశ్వరా! ఈ నిషాదునకు తాను పాప మొనర్చితి నను స్పృహయే లేదు; అజ్ఞానకృతం బైన వీని యపరాధము క్షమించి, వీనికి సద్బుద్ధి ప్రసాదింపుము! నా కఖండశాంతి ననుగ్రహింపుము! (అని నమస్కరించుచుండును.)

భరద్వాజుఁడు — (స్ఫురణ మభినయించి, తనలో) ఏమి యీ యాశ్చర్యము! ఇదంతయు భగవల్లీలావిలాసముగఁ దోఁచుచున్నదే! (ప్రకాశముగా) గురువతంసమా! అప్రయత్నముగ నీ నోట వెల్వడిన యీ శాపవాక్య మపూర్వచ్ఛందో

నిబద్ధము. విశేషించి, ఇపు డా వాక్యమే రక్షోవధం బొనర్చిన మాధవుని పరంబుగ మంగళాశాసనం బై, శుభోదర్కమును సూచించుచున్నది.

వాల్మీకి — (ఆలోచించి, యానందించుచు) అంతరార్థము నతినిపుణంబుగ నిరూపించి, నా కానందకందంబ వైతివి. పవిత్ర మైన నీ గోత్ర మనన్యసామాన్యాభివృద్ధి నందుఁగాక!

భరద్వాజుఁడు — మహాప్రసాదము!

వాల్మీకి — (సవితర్కముగఁ దనలో) ఈ యపూర్వ గీర్వాణకవితాశక్తి యాకస్మికముగ నా కెట్లు లభించినది? మహాత్ముఁ డగు నారదమునీంద్రుఁడు నావలన నేదియో సర్వోత్కృష్టకార్యము సంపన్నము కాఁగల దని యానతిచ్చి యున్నాఁడు. (సాలోచనముగ) కార్యమా? కావ్యమా? అతనిని సందర్శించి పరమార్థము గ్రహించెదఁగాక! (అనుచు నిష్క్రమించును.)

భరద్వాజుఁడు — (వాల్మీకి ననుగమించును.)

శ్రీ రస్తు

# వాల్మీకి

## సప్తమాంకము

(ప్రథమరంగము : వాల్మీక్యాశ్రమవనము)

వాసంతిక — (దిక్కులు చూచి యానందించుచు, ప్రవేశించి)

మ. సుమనోమంజులమందహాసరచనల్ జొబ్బిల్ల, నల్లారు రూం
పముచేమోద్బ్వలఁ గోకిలోక్తుల సమాహ్వానించి, పూఁదేనె న
ర్ఘ్యముఁ బాద్యంబు నొసంగి, నమ్రయయి పండ్లర్పించి సేవించి, ని
త్యము నియ్యాశ్రమలక్ష్మి పాంథులకు బ్రహ్మానందమున్ గూర్చెడిన్!

ఏమి యీ యాశ్చర్యము! శారదాగమసమయము మాధవాభ్యుదయప్రకర్షకముగ నున్నదే! ఇదియే మా తండ్రి యాశ్రమంబు గావలయు! కాదేని, దీని కీ యనార్తవరామణీయక మెట్లు వాటిల్లఁ గలదు? నే నఘమర్షణార్థము తీర్థాటనంబు సేయుచుండినపుడు కర్ణరసాయనంబు గావించుచుండిన వాల్మీకుల ప్రభావప్రశంసల కిది యెంతయుం దగియున్నది. ఆయన మహత్త్వ మప్రమేయముగ నున్నదే! ఆహా! తదుపదేశమాత్రంబున, క్రూరకిరాతు లందఱును పరమభక్తు లైరఁట;

వ్యాఘ్రపాదుఁడు బహిష్కారి యయ్యెనఁట. గుహుఁడు గుర్వాజ్ఞానుసారము గంగాతీరమున మానవసేవ సేయుచున్నాఁడు. ధర్మనిపుణ యై తపం బొనర్చుచున్న యీ శబరి మాయమ్మ యని నమ్మఁజాల నైతిని. ఆమె న న్నాదరమునఁ జేరఁదీసి, "వాసంతీ! ప్రసవాదికంబులం బ్రత్యక్షలక్ష్మిని సేవించి తరింతువే!" యని యావేశంబున నాశీర్వదించి, మా తండ్రి కడ నుండ నియోగించె. అప్పటినుండియే కదా, చమత్కారిణి యను పే రుజ్జగించి, వాసంతీనామధేయ నైతిని. (అనుచు నేపథ్యము వంకఁ జూచి యాశ్చర్యపడుచు) సహజసౌందర్య తుందిలం బగు నీ వనవాటి నలంకరించుచున్నా రేటికి? మెఱపుఁదీవకు మెఱుఁగుపెట్టుట పరిహాసాస్పద మైన వ్యర్థ ప్రయత్నము!

చ. సురుచిరపత్త్రపుష్పఫలశోభిత యీ వనలక్ష్మి కొక్కఁడన్
గొఱఁతఘటించి, యీ బెడఁగెకూర్తురిఁకొక్కఁడఁ ద్రుంచిత్రుంచి; యె
వ్వరో యరు దెంత్రు గావలయు వంద్యులు; తద్గతకౌతుకంబులో
నరయరె కాని, యియ్యదియు నందము చేసెడి చంద మౌనొకో?

పోయి, విశేష మేమో తెలిసికొనెదఁగాక! (అనుచు, నుత్సాహముతో నిష్క్రమించును.)

ఇది విష్కంభము

( ద్వితీయరంగము : వాల్మీక్యాశ్రమము )

[ వాల్మీకి, వాసంతి, భరద్వాజుఁడు ప్రవేశింతురు. ]

వాల్మీకి — ( ఉత్సాహముతో ప్రవేశించుచు ) 'వాసంతీ ! నీ యుదంత మెంతయు శుభోదర్కమును సూచించు చున్నది. నీ వచ్చిన వేళావిశేషము సైత మత్యంతసంతోష కరము. ఇం కించుక సేపటిలో నారదమునీంద్రుని సందర్శింపఁ గలవు; నీ భాగ్యమే భాగ్యము !

వాసంతి — అంతయు మీ యనుగ్రహఫలమే కదా !

భరద్వాజుఁడు — కుమారీ ! ఈ నీ పరిణామమున కెవరు కారకులు ?

వాసంతి — మహానుభావులా వసిష్ఠవిశ్వామిత్రులు.

వాల్మీకి — ( ఆశ్చర్య మభినయించుచు ) వారే నీకును గురువులా ? వారి ప్రేమతరంగిణియే మనలఁ బవిత్రీకరించి నది; వారు మనకు పితృనిర్విశేషులు. వారి ఋణ మెట్లు తీర్చు కొనఁగలము ! ( అనుచు, చేతులు మోడ్చి యాకసము వంకఁ జూచి, ధ్యాననిమీలితనేత్రుఁ డగును. )

వాసంతి, భరద్వాజుఁడు — ( వాల్మీకి ననుకరింతురు. )

[ వసిష్ఠవిశ్వామిత్రులు శాలువులు ధరించి యాడంబర ముగ ప్రవేశింతురు. ]

విశ్వామిత్రుఁడు — ( వాల్మీకి భుజముపైఁ దట్టుచు ) ఆనందరసాబ్ధిలో నోలాడుచున్నాఁడవు, నీ కే వైపు చూచినను తారకమూర్తులే గోచరించుచున్నారా యేమి ?

[ వాల్మీకి ససంభ్రమముగ మేల్కాని వారికి నమస్కరించును ; వాసంతీభరద్వాజులును నమస్కరింతురు . ]

వాల్మీకి — గురువతంసములారా ! మాకు మీకన్న తారకమూర్తు లెవరు గలరు ? సంకల్పమాత్రముననే సన్నివిష్టులైతిరి. ఏ వైపు చూచినను, మీరే గోచరించుచున్నారు. నాకు మారికి సైతముతరణోపాయముచూపితిరనిసంతసించుచు, కృతజ్ఞతాపూర్వకముగ మీకు నమస్కరించుకొనుచుంటిని .

వసిష్ఠుఁడు — యథార్థమున, మన మందఱమును నారదమహర్షికి నమస్కరింపవలసియున్నది .

నారదుఁడు — ( ప్రవేశించుచు, స్వగతముగ )

క. నరకమును నాక మగుఁ గా
వ్యరసామృతదివ్యపాన మబ్బినయంతన్ ;
నరలోకము నాకం బై
పరితోషముఁ గూర్చుఁ గాక వాల్మీకి కృపన్ !

వసిష్ఠుఁడు, విశ్వామిత్రుఁడు, వాల్మీకి, భరద్వాజుఁడు, వాసంతి — ( ఎదురేఁగి నారదుని తీసికొనివచ్చుచు ) దేవర్షిచంద్రమా ! నమస్కరించుచున్నారము !

నారదుఁడు — ప్రత్యభివాదనంబులు .

[ అందఱును యథోచితాసనముల నలంకరించెదరు. వాసంతి వెనుక నొక వంక నిలిచియుండును . ]

వాల్మీకి — (నారదునకు పునః ప్రణామం బాచరించుచు) గురువతంసమా ! ఆకస్మికముగ నాకపూర్వగీర్వాణకవితాశక్తి ననుగ్రహించితివి ; నీకెంతయు కృతజ్ఞుఁడను .

నారదుఁడు — ఋషీంద్రా ! అదంతయు సరస్వతీదేవి సంకల్పప్రభావము ; ఆ దేవిని ధ్యానించి సుప్రసన్నం జేసి కొనుము. (అని తెలియకుండ వాల్మీకి సభిమంత్రించును.)

వాల్మీకి — మహాప్రసాదము ! (అని, ధ్యాననిమీలిత లోచనుఁ డై)

సీ. ఆనందమయశైశవావ్యాజదరహాస
రోచిర్విభూతి దూఁబూఁచియాడి,
క్రీడానతవధూటి ప్రియు మోవులఁ దార్చు
క్రేఁజూపు మెఱుఁపులఁ గ్రేళ్లుదాఁటి,
పొదరిండ్ల విహరించు పుణ్యదంపతుల నీ
లాలలదమృతాబ్ధి నోలలాడి,
విరహదైన్యోత్పన్నవిభ్రమభ్రమణత
రంగరంగములఁ దుఱంగలించి,
భండనోద్దండకాండప్రకాండకాండ
చండకోదండటంక్రియం దాండవించి,
పరమపుమార్థసిద్ధులఁ బ్రజ్వలించు
నల రసస్వరూపను వాణి నభినుతింతు !

నారదుఁడు — వశిష్ఠవిశ్వామిత్రుల వైపు కనుఁగీఁటి వాల్మీకిని పరిహాసించుచు) ఋషీంద్రా ! సరస్వతీదేవిని ధ్యానింపు మనిన, ఏమేమో కథ చెప్పుచున్నాఁడ వేటికి ?

[సరస్వతి నారదుని వైపు చూచి నవ్వుచు ప్రవేశించి, వసిష్ఠవిశ్వామిత్రులఁ జూచును. అందఱు లేచి నిలుచుందురు.]

వసిష్ఠుఁడు, విశ్వామిత్రుఁడు — దేవీ ! నమస్కరించుచున్నారము.

సరస్వతి—(వసిష్ఠవిశ్వామిత్రులతో జనాంతికముగా, నారదుని చూపి నవ్వుచు) ఈ మీ మిత్రునకీ దుండగము లెపుడు మానును? (నారదుని చూచి నవ్వుచు, జనాంతికముగా) కావ్యధోరణికి దింపి, కథ చెప్పె నని యుపాలంభించుచున్నాఁడవా? బాగు బాగు! అవ్యాజప్రేమానుబంధములు గానిచో, నీ పరిహాసప్రబంధములు ప్రాణబంధములుగదా? (వాల్మీకిని వాత్సల్యముతో చూచి, నారదుని చూపుచు) వత్సా! నీకీ మునీంద్రుఁడు నిరంతరారాధ్యుఁడు!

[అందఱు యథోచితాసనము లలంకరించెదరు. వాసంతి వెనుకనుండి సరస్వతికి వింజామర వీచుచుండును.]

వాల్మీకి — తల్లీ! ప్రణమిల్లుచున్నాఁడను. మహాత్ముఁడగు నారదమహర్షి చేసిన మేలు జన్మజన్మాంతరములందును మఱవఁజాలను. ఏమియు నెఱుఁగనివానివలె నటించుచు, ఎంతటి మహోపకార మొనర్చె! నీ సందర్శనభాగ్య మందఱకు లభించునా?

ఉ. నీవు త్రిలోకనేత్రమవు, నీవ తదంతరదివ్యదీప్తి విన్!
నీవు త్రిలోకభావమవు, నీవ తదీయవికాసహేతు వా
జీవకళావివేషమవు! సిద్ధవు సాధ్యవు సాధనంబవున్
నీవ! త్వదీయబింబమును నిల్పుము మన్ముఖదర్పణంబునన్!

దేవీ! ఈ దాసునకు, సందర్శనభాగ్యం బనుగ్రహింపకపూర్వమే, అపూర్వగీర్వాణకవితాశక్తి సిద్ధింపఁజేసితివి; (ఉత్సాహోద్రేక మభినయించుచు) సందర్శనభాగ్యంబుతో పాటు సమస్తదివ్యశక్తులును ప్రసాదించితివి. అయాచితవర

పరంపరాప్రదాయిని నగు నీ యఖండవాత్సల్య మే మని కొనియాడుదును? నా భాగ్యమే భాగ్యము!

సరస్వతి — (మందహాస మభినయించుచు) వత్సా! ఇది నీ భాగ్యము మాత్రమేనా? ఈ యార్యావర్తమం దపూర్వ రూపంబున నవతరింపవలయు నని యెంత కాలమునుండియో నా కభిలాషము. తుద కది నీవంటి యుదారహృదయునివలన ఫలించుట నా భాగ్యవిశేషం బని సంతోషించుచున్నదాన.

చ. కరను కృపాతిరేకతను క్రౌంచి నీ హృది నుత్తరించు చున్
స్ఫురణము నిండఁ బైకుబికి పొర్లిన శ్లోకము రూపుగా ననున్
ధరణి జనింపఁజేసి కడు ధన్య నొనర్చితి; యెల్ల కాలమున్
వరకవిమార్గదర్శి వయి వర్ధిలుమయ్య జగద్ధితంబుగన్!

పురాకృత పుణ్యవశంబున కవిబ్రహ్మ వైతివి. ఆ శ్లోకమే యుపజ్ఞగ మహాకావ్యసృష్టి కొనసాగించి, జన్మంబుఁ జరితార్థముఁ జేసికొనుము!

వాల్మీకి — పరశక్తి! మహాప్రసాదము.

వసిష్ఠుఁడు — దేవి! రాజు కాఁగోరిన యితనిని నీవు కవిరాజును గావించుట యెంతయు సముంజసము.

విశ్వామిత్రుఁడు — (వసిష్ఠు నుద్దేశించి) ఇతఁడు, నీ వను డనినట్లు, రాజాధికుఁ డైనవాఁడు. కవిరాజుల వాగస్త్ర మహత్త్వము రాజుల యస్త్రశస్త్రముల కెక్కడిది?

తే. అద్భుతంబు కవీంద్రవాగస్త్రమహిమ!
ధర్మి గుఱి గన్నఁ గనకున్నఁ, దమకుఁ దామె
లక్ష్యయోగ్యులు దానికి లక్ష్యభూతు
లగుచు, గుణశిక్షఁ గాంచెద రఖిలదిశల!

భరద్వాజుఁడు — కనుకనే, 'సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్?' మ్మనెడి లోకోక్తి సిద్ధించినది.

నారదుఁడు — (వసిష్ఠవిశ్వామిత్రులఁ జూచి నవ్వుచు) ఋషిప్రవరులారా! చోరచక్రవర్తిని కవిచక్రవర్తిగ మార్చుట కుపయుక్తమైన మీ యత్నము సైత మెంతయు సమంజసము.

మ. పదవిన్యాసము మార్గవైకగుణ; మెప్పాటన్ ధ్వనుల్ లక్ష్యముల్;
బ్రదిమిం జూడ, సువర్ణరాసులు రసోత్పన్నాఖిలార్థంబు లు
ద్యదలంకారము — లెల్ల గ్రాహ్యములు; దోషాన్వేషణౌత్సుక్య మ
భ్యుదయాపాదక; మారయన్ సుకవివర్యుల్ చోరు లేకాధ్వగుల్!

సరస్వతి — (వాల్మీకి నుద్దేశించి) వత్సా! నీ వేమియుఁ జిన్నపుచ్చుకొనకుము. నారదకుమారుఁ డించుక పరిహాసశీలుఁ డన్న మాటయే కాని, అతఁ డవిరామపరోపకారపరాయణుఁడు.

వాల్మీకి — జగజ్జననీ! చిన్నపుచ్చుకొనవలసిన కారణ మేమి? అవాచ్యనాముఁడై అచింత్యవ్యాపారుఁడై అస్పృశ్యశరీరుఁడై కాలము గడపుచుండిన యీ నీ దాసుఁడు, పతితపావనుఁ డగు నారదమునీంద్రుని పరిహాసోక్తులకుం బాత్రుఁడగుట తన భాగ్యవిశేషం బని పరమానందభరితుఁ డగుచున్నవాఁడు.

భరద్వాజుఁడు — (తనలో) ఆహా! ఏమి యీ భావగాంభీర్యము! పరిహాసభాషితములు సమానస్కంధోచితములని కవీంద్రుని ధ్వని.

నారదుఁడు — కవీంద్రా! వినయగుణ నైపుణీధురీణంబు లగు నీ ప్రౌఢభాషణములు మా కందఱకును హృదయతోషణములు. ఇటు చూడుము.

మ. అతులౌన్నత్యముఁ గూర్చెఁ దాఁగకుము నీ; కా దివ్యమంత్రాధిదే
వతయున్ గావ్యముఁ గోరి నిన్నుఁ గనిగాఁ గాంక్షోన్న యీ దేవి భా
రతియున్ శ్రీలిఁ గనస, రచింపు మలనిస రామాయణంబు; నున్నత
వ్రత! సాధింతువు నేర్పు రూపనను సర్గస్థాంద్ర మేకశ్రియున్!

విశేషించి, భక్తియోగప్రతిష్ఠాపనాచార్యుండవైన నీవు భక్తి నిధానంబును భక్తనిధానంబును నగు శ్రీరామచంద్రుని యాదర్శకమానుషత్వం బఖండలీలఁ జిత్రింతువేని, నీ కడంగిన లోకోద్ధరణకార్యము నిరంతరము నిరంతరాయముగ నెఱవేఱఁగలదు.

వాల్మీకి — గురువరాంసహా! సంకల్పసిద్ధుండ వగు నీ యాదేశము శిరసా వహించుచున్నాఁడ. కేవలనిమిత్తమాత్రుండను, నా సామర్థ్య మేమో తెలియకున్నది.

తే. దేవునకు దేవుఁ డొసఁగినదే యొసంగి
పూజ గావించు పుణ్యంబు పొందునట్లు,
మీ వరంబుల ఫలమును మీకుఁ గూర్చి
కావ్యకర్తృత్వభాగ్యంబు గాంచువాఁడ!

సరస్వతి — కవీంద్రా! నిశ్చయముగ నీ కాంచు భాగ్యమే భాగ్యము! త్వదీయాశ్రమము ప్రత్యక్షలక్ష్మీవిలాస మందిరము కాఁగలదు.

ఉ. భక్తిరసాంగ ముద్యదనివార్యతపోబలవీచికాగ్ర మ
వ్యక్తగభీరమున్ బరమహంసనికాయ్యము పాతఘోషసం
యుక్తము నౌ త్వదాశ్రమపయోనిధి పుట్టినయి ల్లటంచు నా
సక్తిని జూడ వచ్చి యల జానకి నీవు ముదంబు గూర్చెడిన్!

వాసంతి — (ఆనంద మభినయించుచుఁ దనలో) ఏమి నాఁభాగ్యము! నా తల్లి యాశీర్వాదము ఫలించుటకు దారి యేర్పడినది!

వాల్మీకి — జననీ! నీ యనుగ్రహమువలన నాకు లభింపరాని భాగ్య మేమి కలుగఁగలదు? (అని యానంద మభినయించుచుండును.)

విశ్వామిత్రుఁడు — అహో! ఏమి యీ వాల్మీకి యానందపారవశ్యము.

భరద్వాజుఁడు — భావిభాగ్యస్ఫురణంబువలని యానంద మితనియం దావహించిన ట్టున్నది!

వసిష్ఠుఁడు — చక్కఁగ కనిపట్టితివి.

మ. కలలోఁ గాంచిన మోదమున్ మెలఁకువన్ గన్నట్టి యా మోదమున్
దులఁ దూఁగున్ స్మృతిమాత్రభోగ్యతను; సద్యోమోదమున్ మించెడిన్
గలుగంబోవు ముదంబు, విస్ఫురణదక్షం బై సదా లక్ష్య మై
తలఁపుల్ వాలుకొలందిభోగ్యమయి యుత్సాహంబు హెచ్చించుచున్!

నారదుఁడు — ఋషీశ్వరులారా! ఈవాల్మీకితోపాటు, ఇపు డిట్టి యానందమును మీరును పొందవలసినవారలే!

క. * ఇతఁ డాముష్మికగురుఁ డగు,
† నతఁ డైహికగురువరేణ్యుఁ డగు శ్రీరామ
క్షితిపతికి; ‡ భరద్వాజుం
డతులాతిథ్యమున సార్థకాభిఖ్యుఁ డగున్!

కవీంద్రుఁడు కృతజ్ఞతాపూర్వకముగ మీచరిత్రములు చిత్రించు వాఁడు. మీ రొనర్చిన ఘనకార్యమున కిదియే మీ రొందఁ దగిన పారితోషికము.

---

* వసిష్ఠు నుద్దేశించి; † విశ్వామిత్రు నుద్దేశించి; ‡ భరద్వాజునిఁ జూచి నవ్వుచు.

వసిష్ఠుడు, విశ్వామిత్రుఁడు, భరద్వాజుఁడు — (ఆనందించుచు) మహాప్రసాదము, మహాప్రసాదము!

సరస్వతి — (అందఱ నుద్దేశించి, యానందించుచు) సమస్తమును సంతోషజనకముగ సమాప్తమైనది. (వాల్మీకి నుద్దేశించి) కవీంద్రా! ఇఁక చూఁడుము, నిత్యానందనిమగ్నుండవై యుండెడి నీకితరవాంఛలతో పని లేదని యెఱుంగుదును. అయినను, లోకకల్యాణార్థ మిట్లగుఁగాక!

మ. ధరణిన్ వాఙ్మయపేర మెక్కి బహుధా ధర్మంబు శాసించి త
త్సరణిన్ దూషణభూషణంబు లను శిక్షారక్ష లద్దించుచున్
సరసామోదము గాఁగ మానసమనస్సామ్రాజ్య మశ్రాంతమున్
బరిపాలించు కవీశ వైభవము విశ్వశ్రేయమున్ గూర్చుతన్!

మఱియు,

తే. సుకవినుతజగన్నాటకసూత్రధారి
ప్రాణిపాత్రల నాడించు పట్టులందు
నటన మెల్ల నిత్యానందపటిమఁ జనర
రసను రసరంగముగఁ జేసి యొసఁగుఁగాత!

శ్రీ
భరద్వాజగోత్రపవిత్ర
కాళ్లకూరివంశపయోరాశికువలయాప్త
రాజయామాత్య
గోపాలరాయరచిత
సకలరమ్య
వాల్మీకినాటకము

ముగిసె